# సమాలోచన



జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక

సంపాదకుడు: విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి.

సంపుటము 2 రాజమహేంద్రవరము 16-2-1979 సంచిక 8

## —* ఈ సంచికలో *—



1—3—79 సంచికలో ప్రబంధాల్లో పద్యశిల్పం, ద్రౌపది ధర్మాద్వైత స్థితి, చేమకూర వేంకటకవి సారంగధర చరిత్రము మొదలగునవి ఉంటాయి.

—* 1, 16 తేదీలలో ప్రచురింపబడును *—

చందా
సంవత్సరమునకు రు 10-00.
అర్ధసంవత్సరమునకు రు 5-50.

విడిప్రతి 50 పై.

# త్రిమూర్తులు



— శ్రీ మట్టి వెంకటనరసింహారెడ్డి.

తిలక్ తన 'అమృతం కురిసినరాత్రి' అనే కవితాసంపుటిలో 'త్రిమూర్తు'లను పేర ఒక కవితను వ్రాసెను. అందు అతని దృష్టిలో ఆముగ్గురుమూర్తులు ఎట్టివారో వివరించెను. అందున్న ఆ త్రిమూర్తు లెవరు? ఉచితానుచితము లెట్టివి? అనునది వ్యాస విషయము. వారిని గురించి ఒకడు

హావాడే_మహాగట్టివాడు_మకుటంలేని
　మహారాజయ్యేవాడు,
ఆని ముసలిదాన్ని, మసకమసక కన్నుల
　దాన్ని, మూలమూల ముడుచుకు
　పోయిన్నదాన్ని
నవు చేసుకోవాలన్న ఉబలాటంతో
మంచీ చెడ్డా మరచిపోయాడు
మర్యాదల్ని అతిక్రమించాడు
మరి పనికిరాడు.

ఈయన విశ్వనాథ సత్యనారాయణగారు. ప్రాచీనార్వాచీన కవితా నభస్సునందు తేరిపార జూడరాని ప్రచండ భానుడు.

'మావాడే'_ మాకవికులానికి చెందినవాడే అని అర్థము. 'మహాగట్టివాడు'_ తిలకునకేకాదు యావదాంధ్ర సాహిత్య ప్రపంచమున నెవ్వనికినీ ఈ మాట విశ్వనాథవారిని గురించి అనక తప్పదు. అనకున్నను వానివ్యూట ప్రామాణికము గాజాలదు. ప్రామాదికమే యగును. అట్టియెడ రసజ్ఞశేఖరుడయిన తిలక్ మాత్ర మెట్లూరకుండును.

ఆధునిక యుగమున సయితము ప్రాచీన కవితావాణికి పట్టము గట్టిన విశ్వనాథ, తిలక్ దృష్టిని 'పనికిరానివాడు'. ఈ విషయమునే తిలక్ 'ముసలిదాన్ని మసక మసక కన్నులదాన్ని నవు చేసుకోవాలన్న ఉబలాటంతో మంచి చెడ్డా మరచిపోయినాడనీ, మర్యాదల్ని అతిక్రమించినాడని' సెలవిచ్చిరి.

ఆధునిక కవితాప్రక్రియలను (వచన కవితాదులను) చేపట్టి తిలక్ దృష్టిలోగల అభ్యుదయవాదమును ప్రేరేపించునదైన వస్తువును గ్రహించి కవిత్వము వ్రాసియుండిన యెడల, ఆయన మకుటములేని మహారాజయ్యెడివారు. ఈ విషయమునే 'కఠోపనిషత్', అను మరొక కవిత యందు_

'పదివేల సంవత్సరాలనాటి పాత
　ముఖాన్ని అతికించేందుకు
ఒక హాహా హూహూవు ప్రయత్ని
స్తోన్న ప్రాతఃకాలాన
అధునాతన భావుకులు స్వప్నభుక్కులు
వర్తమానశిరస్సుని వధించబోయే సమ
　　　　　　　　　　యాన'

అని విశ్వనాథ వారిని ఒక పదివేల సంవత్సరముల వెనకకు నెట్టిరి. ఇచట 'హాహా హూహూవు' విశ్వనాథవారని వేరుగా వచింపబనిలేదు. విశ్వనాథవారు అభ్యుదయ నిరోధకశక్తి అన్న ఈమాటనే 'న్యూసిలబస్' అను మరొక కవిత యందు కూడ_

'విశ్వనాథవారు వెనక్కి నడవగా
　　　　　　　　నడవగా
వేదకాలం యింకా వెనక్కి వెనక్కి
　　　　వెనక్కి పోయిందట_'

అనితిలక్ దృష్టిలోగల ఆయన లోపమును అవకాశము దొరికినపట్టుల ఎత్తిచూపి మహారాజ పదమునుండి కొంచెము తప్పించిరి. ఇదీ తిలక్ సృష్టించిన విశ్వనాథమూర్తి.

తిలకునకు విశ్వనాథవారి కవిత్వముపై ఏ విధమైన న్యూనభావము లేదు. మీదు మిక్కిలి గౌరవము గలదు. గాన 'మహాగట్టివా'డనక తప్పలేదు. తాను పేర్కొనిన ఆ ముగ్గురిలోకూడ విశ్వనాథవారిని మొదట చెప్పుటలోగల ఆంతర్యమిదియే. ఇక మర్యాదల నతిక్రమించుట అనగా ఆధునిక సాహిత్య మర్యాదల ననిఅర్థము చెప్పుకొనవలె. వచన కవితావాది ప్రక్రియలు_ మధ్యతరగతి జీవులచిత్రణ, సామాజికస్పృహ అనునవి ఆమర్యాదలు. ఆధునిక కవితాప్రక్రియలను నిరసించుట ఒకటి, నేటి కాలమును చిత్రించలే దని రెండు. ఈ విషయములలో మాత్రమే తిలక్ విశ్వనాథవారితో విభేదించె ననుట స్పష్టము. తిలక్ ఇంతగా అన్నిమారులు విశ్వనాథవారిపై విరుచుకొని పడినది, బహుశః వారు రామాయణ కల్పవృక్షమును వినిర్మించుటచేతనే అయియుండవచ్చును అట్లుగాకుండిన అధునాతన భావుకుడు స్వప్నభుక్కు అన్నవారి మాటల కర్థమేమి?

కాని ఈవిషయమున తిలక్ మాటయే శిరోధార్యము కాజాలదు. విశ్వనాథ వారిని ప్రక్కనుంచి ఆంధ్రసారస్వత సరస్వతిని చూచినచో నెంత జాలిగా బోసిగా చిన్నవోయి కనిపించునో? విశ్వనాథవారులేని తెలుఁగు సాహిత్యమున సంపూర్ణత లేదు. ఆయనను గూర్చి మనమేమి చెప్పుటకును అర్హులము కాజాలము. కాని ఒకటి మాత్రము నిజము_ 'ఒకడు విశ్వనాథ' అంతియ. ఆ 'ఒకడు' మరెప్పుడూ మరెవడూ కాలేడు. కనుక విశ్వనాథ విషయకమైన యీ మాట చేసిన సాహసమే అనవలె.

'... తెనుఁగులంతస్థై నేర్చుకొనియుందురు?
రెన్నగా తెన్గు తల్లులు మున్ను శౌర్య
రస మొడిచి యుగ్గు పాలతో రంగరించి
బొడ్డుకోయని కూనకే పోయుదురట

(ఆంధ్రప్రశస్తి)

అని పూర్వాంధ్ర కావ్యవైభవమ్మును తలపించి చచ్చిపోయిన తెలుఁగు రక్తమును చైతన్యామృతముతో తడిపి తట్టి లేపుచున్న విశ్వనాథవారు అభ్యుదయవాదికాక మరేమగును? ఇయ్యది భావుకతకాదు. స్వప్న భోజనము అంతకంటెను కాదు. నీవు నీవుగా బ్రతుకు, నీదేశపువాడుగా బ్రతుకు;అనునది ఆయన మతము. కవిత్వమున పార్టీలు పనికిరావు. అది రాజకీయ వేత్తలపని. మన కెందులకు? నేను అభ్యుదయవాదిని అని బల్ల గుద్దుకొనిన తప్ప అభ్యుదయవాది కాడాఏమి? సాహిత్య ప్రభావము సంఘము మీద పడినది యనుకొనుట పొరపాటు. సంఘ ప్రభావమే సాహిత్యము మీద పడును. సంఘర్షణము లేపును. నాదృష్టిలో కవిత్వపు పరమావధి ఆనందమే. ఒకవేళ ఉపదేశము ఉన్నా తప్పులేదు. ఉండటం వలన సమాజము మారిపోదు. ఉపదేశమే చేయదలచుకున్న యెడల వేమన పద్యములు సుమతి పద్యములు కొల్లలు. అందు కవిత్వ మేది? వేమనను కవి అన్నవాని నాలుక కాలిపోవును. శ్రీ రంగ నీతులు వల్లించునపుడు ఉట్టంకించుటకు పనికి వచ్చునవే కాని యందు కవిత్వమును వెదకుట. మృగతృష్ణను చూసి నీటికోసమై పరువులెత్తునట్లే అగును. మేము విప్లవ కవిత్వమును వ్రాయుచున్నాము అను వారందరకు వేమన ఆద్యుడు. వేమనను మించిన సంఘసంస్కారి లేడు. కవిత్వము ఒక అల్కెమీ, అనిన తిలక్ కవిత్వము అందముగా చెప్పవలె ననియే ప్రయత్నించి చెప్పినాడు కాని, ఆయన మాత్రము సులభముగా సూటిగా చెప్పినదేది? ఎటొచ్చీ పద్యములు వ్రాయలేదు. పౌరాణిక వృత్తములు సైకొనలేదు. వచనకవితలలో చెప్పినా డను మాట ఒకటి దక్క. ఆయన కవితలు జంధ్యాల వారి పద్యములకన్న, జాషువా పద్యముల కన్న, విశ్వనాథవారి కిన్నెరసాని పాటల కన్న సులభతరములా? వేమన పద్యముల కన్నను నీతిబోధ సమర్థకములా? వచనమని యొకటి ప్రత్యేకించి యుండ ఇక వేరుగా వచనకవిత లెందుకు? సూటిదనమున కివియన్నియు అడ్డము రావా? శబ్దాడంబరమునకు దాసుడయి పోయిన కవిలో విషయ గౌరవము తగ్గిపోవు నని నాటినుంచి నేటి తిలక్ వరకు అనినవారే. మరి తిలక్‌లో శబ్దాడంబరము ఎంతైనా ఉన్నది. కనుక పొరపాటున ఈ మాట అనుట తిలక్ తానందుకేమీ అపవాదము కాలేనని,ఆలోచించక పోవుటయే. విశ్వనాథవారు చేయనిపని యెల్ల, వచన కవితలు వ్రాయక పోవుట, డ్రైనేజి గుంటలను వర్ణించక పోవుట. మన సారస్వత సరస్వతిని వలువ లూడ్చి దిగంబరముగా చూచుట యెడ ఆయన విముఖుడు. అందుకే కాబోలు తిలక్ యోగ్యతా పత్రమునకు నోచుకొనలేదు.

తిలక్ అనిన నాకు చాల గౌరవము. అంతమాత్రముచేత ఇట్టి ఆయన అభిప్రాయమును సమర్థించవలసిన పనిలేదు. పాక్షికముగా కాక సమదృష్టితోడ నిజము నావిష్కరించుటయే నా అభిమతము. తిలక్ సంస్కారిలోపేతుఁడు. కనుకనే విశ్వనాథ వారిని గూర్చిన ఆయన అభిప్రాయము సంసారదూరము కాలేదు. వారి కవిత్వమును ఆయన మెచ్చక మెచ్చినట్లైనది. తిలక్ చెప్పుకున్న కృష్ణశాస్త్రి, శ్రీశ్రీల కంటెను కూడ విశ్వనాథ పక్షమునకే మొగ్గు చూపినాడని చెప్పుట ఎంత మాత్రము అత్యుక్తి కానేరదు. ఇది తిలక్ అంతర్యము చెప్పినమాట. కావున విశ్వనాథ వారు మకుటములేని మహారాజే. మహ గట్టివాడే. మన అందరివాడే.

మరొకడు
మల్లెపూల మీద పరుంటాడు,
మంచిగంధం రాసుకుంటాడు.
మరి ఎందుకేడుస్తాడు?
మంచిపనివాడు, మాకు నచ్చినవాడు,
మంత్రనగరానికి వెళ్ళొచ్చినవాడు.
మాతోపాటు నడుస్తానంటాడు
మరి నిజంగా వస్తాడా?

ఈ మరొకడు దేవులపల్లి కృష్ణశాస్త్రి. ఇంతకంటె రెండు, మూడుదశాబ్దములకు ముందు భావ కవిత్వపు యౌవనపునడిరోజులు. ఆరోజులలో ఈ భావకవులు మల్లెపువ్వువంటి ధౌతపటావరణంబు. గంధకలనమును పీటి గంధస్థగితేతరమై తమ పొలుపు దెల్పెడివారు. విలాసము కవిత్వమున ఒక భాగముగా నుండెడిదనిన అతిశయోక్తి ఏమియు కానేరదు. ఆత్మాశ్రయ కవిత్వమువ్రాసి తమ అనుభూతులను ఆవిష్కరించుకొని నారు. ఈ ఆత్మాశ్రయవాదులది అదొక రకముపిచ్చి వారి మతము వారిది. వారి అనుభూతి

వారిది. వారి ఏడుపు వారిది. కనుకనే దేవులపల్లి "ఏడ్వగానిండు ఏడ్వగానిండు అని ఏశ్నుచు సేయుండెను కాబోలు! తిలక్ "మరి ఎందు కేడుస్తాడు" అని ప్రశ్నించినాడు. అప్పటికి ఆయనగారేమీ నొచ్చుకొనక "నవ్విపోదురుగాక నాకేటి సిగ్గు" అని ఏడుపులోనే మునిగిపోయినాడు. "మరి నిజంగా వస్తాడా? అని తిలక్ విచికిత్సలో బడినాడు.

దేవులపల్లి భావకవి. అందునా ఆత్మాశ్రయవాది. పద్యమును వదలి తదితర ప్రాచీన కావ్య సంప్రదాయములను వదలి, మాత్రా ఛందస్సునాశ్రయించి, భావకవిత్వపు ప్రాంగణమున కాలూని నిల్చినవారు. అయినను అభ్యుదయ కవిత్వమునకనతి దూరములోనే యుండిపోయిరి. ఈ లెక్కను ప్రాచీనకావ్య సంప్రదాయబద్ధులైన విశ్వనాథవారికంటె దేవులపల్లి తిలక్‌నకు సమీపస్థుడు. మాటకందే దూరములోనున్నవాడు. దాదాపుగా కొంచెమెడమైనను ఒకేబాటను పయనించుచున్నవాడు. అయినను చివరంట వచ్చునో లేదోయని "మాతోపాటే నడుస్తానంటాడుమరి నిజంగా వస్తాడా?" అని తిలక్ సందిగ్ధతలో పడెను.మంచిపనివాడే ఎవరు మాత్రము కాదనగలరు? మంత్రనగరము (సినిమా రంగము) నకు వెళ్ళివచ్చినవాడు. మనకందరకు ప్రియమైనవాడు.

మూడోవాడు
అరె! వీడు చిచ్చరపిడుగు, ఎండలోనడిచే
మనుష్యులకు గొడుగు
ముందుకు వేసిన అడుగు
మాకు చిన్నన్నకానీ, అన్నన్న! ఈ
మధ్య విదేశాల చవకబారు
పానీయాలు సేవించి
మత్తుగా పడుకున్నాడు
మరి యిప్పట్లో లేవడు.

ఈ మూడోవాడు శ్రీశ్రీ శ్రీరంగం శ్రీనివాసరావు. వచనకవితకు శ్రీశ్రీఆద్యుడుకాకపోయినా దీనికి చక్కని శైలికూర్చినవాడు, అభ్యుదయ కవితాశంఖమునుపూరించినవాడు, శ్రీశ్రీ అని నిస్సంకోచముగా చెప్పవచ్చును. ముందుకు వేసిన అడుగుగా ఆయనపేరు ఇంతగా వెలుగులోనికి వచ్చుటకు కారణము అభ్యుదయ కవితావస్తువే కాదు, దానికంటెను ముఖ్యముగా ఆయన స్థాపించుకున్న శైలీ విశేషమే. శైలీరమ్యతయందు మిక్కిలిగా మొగ్గుచూపిన తిలకు కూడ శ్రీశ్రీశైలిని గాంచియే ముగ్ధుడైనట్లు ఆయన కవితలను పరిశీలించిన అవగతమగును.

"రాబందుల రెక్కలచప్పుడు
పయోధర ప్రచండఘోషం
ఝుంఝూనిల షడ్జధ్వానం"
వినిపించి పెనునిద్దుర వదిలిరాని
అదలించిన శ్రీశ్రీ 'చిచ్చర పిడుగు',
'ఒక వ్యక్తిని మరొక్క వ్యక్తి
ఒకజాతిని వేరొక జాతి
పీడించే సాంఘికధర్మం
ఇంకానా యికపై సాగదు?

అనిన శ్రీశ్రీ ఎండలోనడిచే మనుషులకు గొడుగు. 'పదండి ముందుకు పదండి తోసుకు' అని అడుగులను ముందుకు వేసినాడు. సంప్రదాయపు శృంఖలములను త్రెంచుకొని మరొక అడుగు ముందుకు వేసినాడు. అభ్యుదయవాదు లందరకు చిన్నన్న. మరి పెద్దన్న ఎవరో నాకు తెలియదు.

ఆమధ్య విదేశాల చవకబారు పానీయాలు సేవించి మత్తుగా పడుకున్నాడు. ఇది శ్రీశ్రీ నైతిక పతనమున కుదాహారణము. రష్యన్ పార్టీ సాహిత్యానువాదములు చైనా పార్టీ స్లోగన్స్‌కు మస్తుగా డబ్బుగడించడంలో నిమగ్నమై సుష్టుగా పడుకున్నాడు. మరి ఇప్పట్లో లేవడు. లేచే వరకు భవభూతిశ్లోకాలు, పరమేష్ఠిజాకాలు చెదలుతిని, గజమున్నరదుమ్ముపట్టి, కనిపించక, జడలుకట్టి చెవుల నావర్తించి వినబడక వెత్తిగొంతుకవిచ్చి మ్రోయవలసి ఉంటుంది. కావుననే తిలక్ 'అన్నన్న'! అని ముక్కునవేలుంచుకొనినాడు. మరి యిప్పట్లో లేవడనికూడ భరోసా ఇచ్చినాడు.

శ్రీశ్రీలో భావతీవ్రత ఎక్కువ. ఆవేశము మాటున అసలు మనిషి కనిపించడు. వాడు ఏదిచెపునో అదిచేయుడు. ఏది చేయునో అది చెప్పడు. మాటకు చేతకు భూమ్యాకాశాల కున్న అంతరం. "ఉల్లిగడ్డ తినుట తప్పని జనమున కుపదేశించిన హరిదాసు ఉల్లిపాయలులేని పప్పు చూసి యిదేమిటే గృహిణీ! పప్పులో ఉల్లిపాయలు వేయలే దేమని ప్రశ్నించెను. మీరు వలదనికదా చెప్పితిరి అని భార్యామణి ప్రత్యుత్తరము. అందులకు హరిదాసు నవ్వి ఓసి పిచ్చిదానా! అదిమనకు కాదే పిచ్చి జనులకు; అని తన ఫిలాసఫీ బయటపెట్టినాడు." శ్రీశ్రీ తత్త్వమూ యిందుకు విరుద్ధమేమీ కాదు. 'తాజ్‌మహల్ నిర్మాణానికి రాళ్ళెత్తిన కూలీలెవ్వరు" అని సామాన్యుని అస్తిత్వమును ప్రశ్నించిన శ్రీశ్రీ తన యింటి రాళ్ళను మోసిన కూలలెవ్వరో చెప్పలేదేమి ? అది శ్రీశ్రీ గారియిల్లేఅందురుగాని దానికి రాళ్ళెత్తిన వారెవ్వరు? అని ప్రశ్నించ రెందుకు? అర్థములేని ఆవేదన. 'ప్రమాదో ధీమతామపి? పాపము శమించుగాక!

# మాఘుని కావ్యనిర్మాణ దక్షత

- డా. నేతి అనంతరామశాస్త్రి, ఎం. ఏ., పిహెచ్. డి.

సంస్కృత సాహిత్య ప్రపంచమున అద్భుత ప్రతిభతో ప్రకాశించు కవిశ్రేష్ఠుడు మాఘుడు. ఇతడు గొప్పపండితుడు. ఇతని పాండిత్యము బహుముఖమైనది. ఈతడు 'శ్రీవర్మరాజు' ఆస్థానమున సర్వాధికారియగు సుప్రభదేవుని పౌత్రుడు. ఇతని తండ్రి దత్తకుడు పరమోదారుడు. వదాన్యశూరుడు. ఆశ్రయదాత. ఇతడు గుజరాతురాష్ట్రములోని ప్రధాన నగరమైన 'భీనమాల' యందు జన్మించెను. సంస్కృత మహాకవులలో పదిమంది గణనీయులలో మాఘుడుకూడ గణింపబడుట గమనింపదగినది.

'ఆగౌ కాళిదాసః స్యా
  దశ్వఘోష స్తతః పరమ్ ।
భారవి శ్చ తదా భట్టిః
  కుమార శ్చాపి పంచమః ॥
మాఘరత్నాకరౌ పశ్చా
  ద్ధరిశ్చంద్ర స్త థైవచ ।
కవి రాజశ్చ శ్రీహర్షః
  ప్రఖ్యాతాః కవయో దశ ॥

ఈతడు సంస్కృత పంచకావ్యములలో నొకటిగ ప్రసిద్ధి చెందిన' శిశుపాలవధ' యను మహాకావ్యమును రచియించెను. ఈకావ్యము మాఘకృతమగుటచే మాఘ కావ్యమనియు నిది ప్రసిద్ధి కెక్కినది. సంస్కృత వాఙ్మయమునందలి కావ్యములలోనిది శిఖరాయమాణముగా నేటికిని నిలిచియున్నది.

మాఘునికాల నిరూపణ మందుభేదాభిప్రాయములు కలవు. సమగ్ర పరిశీలనానంతర మీక్రింది విధముగా నిర్ణయించుట సమంజసముగ నున్నది.

'శ్రీవర్మల' పేరునుపోలిన 'శ్రీవర్మలాత' అను రాజు క్రీ.శ. 625 సంవత్సమున నున్నట్లు గల శాసనాధారము ననుసరించియు, ఆనందవర్ధనుడు(క్రీ.శ. 850) నృపతుంగుడు (క్రీ.శ. 850); రాజశేఖరుడు (క్రీ.శ. 900) మొదలైనవారు తమ కావ్యములందు మాఘుని పేర్కొని యుండుటచేతను, ఈతడు 7వ శతాబ్దపు టుత్తరార్థములోని వాడని నిర్ణయింపవచ్చును.

మాఘునిమహాకావ్యము పూర్తిగా నిరువది సర్గలతో పరిసమాప్తమైనది. మహాకావ్యమున కావశ్యకమైన సమస్తసాధన సంపత్తియు నిందు కడు నేర్పుతో సమకూర్పబడినది. మహాకావ్యములో నుండవలసిన ఋతువర్ణన, ప్రభాతవర్ణన, రాజవంశవర్ణన, యుద్ధాది వర్ణనలు కలవు. శిశుపాలవధయందలి కథ భాగవత దశమస్కంధమునుండి, మహాభారత సభాపర్వమునుండి స్వీకరింపబడినది. ఇందలి కథ సుప్రసిద్ధ మని వేరుగా చెప్పబని లేదు.

శ్రీకృష్ణునితో నారదుడు సంభాషించుట,శిశుపాల వధార్థము కృష్ణుడు ఇంద్రప్రస్థమునకు పోవుట, రైవతకాద్రిపై విహరించుట, యుధిష్ఠిర సభావర్ణనము, ధర్మరాజు రాజసూయము చేయుచు శ్రీకృష్ణునకు అర్ఘ్య మొసగుట. శిశుపాలుని యుద్ధయాత్ర- కృష్ణునితో ద్వంద్వయుద్ధము. శిశుపాలసంహారము మున్నగు సన్నివేశములతో నీమహాకావ్య మెంతో మనోహరముగ వర్ణింపబడినది. ఇందు నాయకుడు శ్రీకృష్ణుడు. శిశుపాలుడు ప్రతినాయకుడు. ఇందు వీరము ప్రధానరసము. శృంగారాదు లంగరసములు, శబ్ద తర్క వేదాంత శాస్త్ర నిష్ణాతుడైన మాఘుడు శిశుపాలుని శ్రీకృష్ణుడు వధించుట యను పురాణగాథను గ్రహించి ఇరువది సర్గల కావ్యముగ రచించెను.

మాఘుడు కేవల మొక ఉత్తమశ్రేణికి చెందిన సరస కవియే కాదు, మహావైయాకరణుడు, వేదజ్ఞుడు, వేదాంతజ్ఞుడు. ఉపనిష దర్థ రహస్య వేత్త. ధర్మశాస్త్రజ్ఞుడు, మంత్ర, తంత్ర, యోగశాస్త్రములందు ప్రవీణుడు. బహుపురాణజ్ఞుడు, ఐతిహాసికుడు, కావ్యరసికుడు, భూగోళశాస్త్రజ్ఞుడు, ఛందశ్శాస్త్రజ్ఞుడు, జ్యోతిష, కామతంత్ర, ఆయుర్వేద, సంగీత సాముద్రిక శాస్త్రముల నెఱిగినవాడు ఇంకను హయ, గజశాస్త్రములందు ప[రి]పూర్ణమైన పాండిత్యమును గడించినవా[]డని 'శిశుపాలవధ' కావ్య మాద్యంతము చదివినవారి కవగత మగును. కవి త[]మహాకావ్యమందు కవితా సుందరి నలంకరించుటకు తన సమస్తప్రజ్ఞ నుపయోగి[]చెను. నానావిధములైన పుష్పములతో కూర్చబడిన మాలవలె శిశుపాలవ[ధ]కావ్యమందంతటను సమస్తములైన సుం[ద]రకావ్యాంగముల హృదయంగమ సమన్[వ]యము కనబడుచున్నది. ఈగ్రంథము[]

చదువుటయనగా వేదశాస్త్రములందు పాండిత్యమును సంపాదించుట యని యర్థము. ఏతత్సంపాదనార్థము శ్రమించినచో ఒకమానవుని వయస్సు గతించుననుటలో విప్రతిపత్తిలేదు. అందులకే 'మాఘే మేఘగతం వయః'-అని వ్యాఖ్యాతృశిరోమణియైన మల్లినాథుడు కంఠోక్తముగాఁ బలికినాడు. మాఘ మేఘ సందేశ కావ్యముల రెండింటిని చదివి అర్థముచేసికొని యాదియనుభవమునకు వచ్చుసరికి వయస్సు గతించెనని పైసూక్తియొక్క అభిప్రాయము.

ఈ కావ్యమునందు సంస్కృతమునందలి సుప్రసిద్ధ శబ్దజాలమంతియు నుపయోగింపబడినది. కావుననే

'నవసర్గగతే మాఘే
నవశబ్దో న విద్యతే'-

యను నానుడి యీతని యెడల సార్థకమైనది. మాఘకావ్యమందలి తొమ్మిది సర్గలు చదివిన పిమ్మట ఇక నూతనమైన శబ్దములు కన్పించవట. ఇందు 'నవ' శబ్ద ప్రయోగమున [నవ-తొమ్మిది; నూతనము] శ్లేష సాధింపబడినది.

పైని పేర్కొనిన శాస్త్రములందు మాఘుడు నిష్ణాతుడని ప్రమాణీకరించుటకు దిఙ్మాత్రముగా నుదాహరించెదను.

ఇతడు మహావైయాకరణు డనుటకు 'బుభుక్షితైర్వ్యాకరణం' అను శ్లోకమే చాలును. ఇతడు సనాతన వైదికమతానుయాయి అనుటకు కావ్యమునందలి ప్రథమసర్గస్థ నారదకృత శ్రీకృష్ణస్తుతి నిదర్శనము. అంతేకాక పదునాలవ సర్గయందు పితామహ భీష్మకృత శ్రీకృష్ణస్తుతియు నిదర్శనము. రెండవసర్గయందలి బలరామోద్ధవుల రాజనీతివర్ణనము ప్రశంసనీయమైనది. ఇతడు బౌద్ధజైనగ్రంథములను పరిశీలించినవాడనుటకు రెండవసర్గలోని 47, 95, 112 శ్లోకములు, పదునాలవ సర్గయందలి 66, పందొమ్మిదవ సర్గలోని 65వ శ్లోకము నిదర్శనములు. మన్వాది ధర్మశాస్త్రానుసారము సృష్టిక్రమ పరిజ్ఞాన పరిచయము కలదనుటకు ఏడవసర్గయందలి 7వ శ్లోకము, సాంఖ్యదర్శనజ్ఞానమునకు ప్రథమసర్గలోని 33వ శ్లోకము, పదునాలవ సర్గయందలి 17వ శ్లోకము, లక్ష్యములు. మంత్రశాస్త్రజ్ఞానమునకు రెండవసర్గ 62వ శ్లోకము, న్యాయశాస్త్రపరిజ్ఞానమునకు రెండవసర్గ 71వ శ్లోకము, ఆయుర్వేద శాస్త్రజ్ఞుడనుటకు రెండవసర్గ 54వ శ్లోకము, పురాణ విషయకజ్ఞానమునకు మొదటిసర్గ 15, 47, 50, రెండవసర్గ 38, 39, 40, 60 శ్లోకములు నిదర్శనములు.

కవిత్వమునకు సంబంధించి వేరొకయుత్తమగుణము మాఘుని కవితయందనితర సాధారణముగా కనుపట్టును. ప్రకృతి వర్ణనమున నత్యంత సూక్ష్మదర్శిత్వము ఈతని కవిత్వమున పుష్కలముగా కనుపట్టును. పర్వత (4వసర్గ) ఋతు (6వసర్గ) సుందరీమణుల జలక్రీడ (8వ సర్గ) చంద్రోదయ (11వ సర్గ) ప్రభాత (12వ సర్గ) యుద్ధాది (16, 17 సర్గలు) వర్ణనలను అత్యంతసూక్ష్మముగాను, గంభీరముగాను చిత్రించెను. 'రైవతక' పర్వతవర్ణనము నెంత సుందరతమముగా నుపమసాయముతో వర్ణించెనో కనుడు.

'ఉదయతి వితతోర్ధ్వరశ్మిరజ్జా
వహిమరుచౌ హిమధామ్ని యాతిచాస్తమ్
వహతి గిరి రయం విలంబిఘంటా
ద్వయ పరివారిత వారణేంద్ర లీలామ్'
(4-20).

సూర్యోదయము, చంద్రాస్తమానము రైవతకపర్వతముపై గనిన భావుకున కీ దృశ్యము ఈవిధముగా కన్పట్టును.

రైవతకపర్వతము మహాదిగ్గజము. సూర్యచంద్రు లిరువురు రెండు ఘంటల వంటివారు. ఆ ఘంటలచే చుట్టబడినది రైవతకగజము అను పోలిక ప్రాచీన సమాలోచకులకు నచ్చి ముగ్ధులై 'ఘంటా మాఘుడని' బిరుదు నిచ్చిరి. ఇట వృత్తము కూడ మార్పునుచెంది శ్లోకముయొక్క సొగసు నినుమడింప చేసినది. పుష్పితాగ్రం వృత్తము. అలంకార ముపమ.

వికట యుద్ధప్రసంగ చర్చ వచ్చినపుడు ఈతని శైలీరచన మనితర సాధారణమైనది. ఈ విషయమునకు 19వ సర్గ యంతయు లక్ష్యప్రాయమై యున్నది. ఈ విషయమును వర్ణించు సమయమున కవి తన రచనాశైలి నెఱుక పఱుచుటకై వికటబంధరచనము లనదగు సర్వతోభద్ర బంధము, చక్రబంధము, గోమూత్రికా బంధము, మురజబంధము, అర్ధభ్రమక బంధము రచనముతో పాఠకుల నుఱ్ఱూతలూగించెను. పైనుడివిన బంధము లన్నియు సైనికవ్యూహరచనమునకు కూడ నుపయోగింతురు.

(సశేషము)

# చంపకమాల

— డా. గంటి శ్రీరామమూర్తి.

1974 వ సంవత్సరం ఫిబ్రవరి నెల భారతిలో మహాభారత సంశోధిత ప్రతిని గూర్చి నిడదవోలు వెంకటరావు గారు వ్రాసిన సమీక్షావ్యాసాన్ని పురస్కరించుకొని 'మాఘకవి-తెనుగుకవిత' అన్న పేరుతో వేదము వేంకటరాయశాస్త్రి (ఫిబ్రవరి 1964), 'శ్రీ నిడదవోలు వారికి సమాధానం : మనవి' అన్న శీర్షికతో సంపత్కుమార గారు (మార్చి, 1975) వ్యాసాలు వ్రాశారు. వారు ముగ్గురు సంస్కృతంలోని చంపకమాలావృత్తాన్ని గూర్చి చర్చించారు. నిడదవోలు వారు సంస్కృత భాషలో చంపకమాలకు ప్రయోగం లేదని, అందుచేత అది సంస్కృతీయం కాదని నిర్ధారించారు. గుణగ విజయాదిత్యుని సాతలూరి శాసనంలోని 'అరినృపవాజి వారణ' శ్లోకాన్ని చంపకమాలకు ప్రథమోదాహరణంగా స్వీకరించారు. రాజశేఖరుడు, మాఘుడు ఈ శాసన శ్లోకాన్ననుసరించి శ్లోకరచన చేశారని కూడ వ్రాశారు. వేదమువారు మాఘకవి గుణగవిజయాదిత్యుని కన్న చాల పూర్వుడని నిరూపించి, చంపకమాలావృత్తం సంస్కృతీయమే అని నిశ్చయించారు. అయితే మాఘుని చంపకమాలావృత్తాన్ని, చంపకమాలా లక్షణం తెలిసిన ఆంధ్రపండితుడు మల్లినాథసూరి 'పంచకావళీ' వృత్తంగా గుర్తించి, లక్షణ సమన్వయం చేసి, గానికే మరొక పేరుగా 'ధృతశ్రీ' వృత్తాన్ని పేర్కొని వ్యాఖ్యానించడం చూసి విస్మయచకితు లయ్యారు. 'సంపత్కుమార' గారు తమ వ్యాసంలో చంపకమాలా వృత్తం సంస్కృత కావ్యప్రపంచంలో ప్రచారంలో లేకపోయినా, సంస్కృతీయమే అని తీర్మానించి, గమనించదగిన మరొక అంశం ఏమిటంటే- శశివదన, సరసి సలిమి నిధి అన్న పేర్లతో చంపకమాల సంస్కృత ఛందో గ్రంథాల్లో చెప్పబడింది' అన్న రావూరి దొరస్వామిశర్మ గారి వాక్యాన్ని ఉట్టంకించారు.

పైముగ్గురు పండితులు ముఖ్యమైన ఒక విషయంలో పొరపడ్డారని తోస్తోంది. న,జ,భ.జ,జ,జ,ర అన్న గణాలతో ఇరవై ఒక్క అక్షరాల పరిమితి గలిగి యతిప్రాసలతో కూడిన చంపకమాలా వృత్తం తెలుగులో ప్రసిద్ధమైనందువల్ల, సంస్కృతంలో కూడా చంపకమాలా వృత్తం ఉంటే, ఇలాగా ఉంటుందని భావించారు. సాతలూరి శాసనకర్త తన వృత్తాన్ని చంపకమాలగా పేర్కొన్నాడో లేదో నాకు తెలియదు. అయినా ఉదాహృత శ్లోకంలో తెలుగు చంపకమాలకు చెప్పబడ్డ గణాలు కనిపిస్తున్నాయి. అలాగే మాఘుని శ్లోకం కూడా తెలుగులో చెప్పిన లక్షణానికి సరిపోతోంది. అందుచేత ఈ వృత్తాలను చంపకమాల అని గుర్తించడం సహజం. కాని ఈ గుర్తింపు సరికాదేమో అనిపిస్తోంది. మనయుగంలో మహా తపస్విగా, మహాకవిగా ప్రసిద్ధి చెందిన కావ్యకంఠ వాసిష్ఠ గణపతిముని తమ జగత్ప్రసిద్ధమైన 'ఉమాసహస్ర' కావ్యంలో ఒకస్తబకానికి స్తబకము (అనగా ఇరవైఅయిదు శ్లోకములు) ఈ ఛందస్సులో హుందాగా నడిపించారు. అందమైన ఈ వృత్తం సంస్కృతంలో అపురూపమైనది కూడా అయితే ఈ వృత్త లక్షణం, తెలుగు చంపకమాలా లక్షణం కన్నా విభిన్నమైనది. ఇది పదవదైన 'పంక్తి' ఛందస్సులో ఉద్భవించి, పదిఅక్షరాల పరిమితిగలిగిన వృత్తం. తెలుగు చంపకం 'ప్రకృతి' ఛందస్సులో పుట్టిన ఇరవైఒక్క అక్షరాల పరిమితిగల వృత్తం. ఇందులోని గణాలు 'భ, మ, స, గ' అని తెలుస్తోంది. స్తబకాంతంలో ముద్రాలంకార శోభితమే కాక, శ్లేషోత్థాపిత పరిణామాలంకార రంజితమైన ఈ చంపకాన్ని ఆస్వాదించండి.

కాచిదమూల్యా చంపకమాలా
వృత్తనిబద్ధా మంజుల మాలా
అస్తు గణేశస్యేశ్వర కాంతా
కంఠ విలోలా చంపకమాలా.

(20వ స్తబకం. శతకం 5.)

గణపతిముని గారి సంస్కృత పాండిత్యాన్ని శంకించవలసిన పనిలేదు. వారు అనేకమైన ప్రాచీనవైదిక, లౌకిక ఛందస్సులను ఉద్ధరించారు. కాని స్వతంత్రించి, సృష్టించినట్లు నిదర్శనం లేదు. కనుక ఇది సంస్కృత భాషలో ఉన్నదనే మనం భావించ వలసి ఉంటుంది.

ఇందొక విషయంకూడ గమనించాలి. శశివదనాదులైన పేర్లతో చంపకవృత్తాన్ని సంస్కృతంలో పిలిచేవా రన్న అభిప్రాయం సరియైనదికాదు. శశివదనా వృత్తం గాయత్రీ ఛందస్సులో పుట్టింది; చంపకమాల పంక్తిచ్ఛంద స్సంబంధి; తెలుగు చంపకమాల 'ప్రకృతి' ఛందస్సులోంచి వచ్చింది. గణపతిముని గారి 'ఇంద్రాణీసప్తశతి' లోని ప్రథమ స్తబకం శశివదనావృత్తంతో సాగింది' ముద్రాలంకార ఘటితమైన ఈచరమ శ్లోకాన్ని తిలకించండి,

శశివదనాభి ర్గణపతి జాభిః
శశివదనాద్యా పరిచరితాస్తు.

ఇందలి గణాలు, న,య, న,య, అని స్పష్టం. ఇది చంపకమాల కాదని తేట తెల్లమే. తెలుగులోని చంపకమాలా వృత్తానికి, సంస్కృతంలోని చంపకమాలా వృత్తానికిగల భేదం తెలిసినందువల్లనే, మల్లినాథసూరి మాఘునిశ్లోకాన్ని చంపకమాలగాకాక 'పంచకావళి' గా గుర్తించాడేమో అనిపిస్తోంది.

పైవ్రాసిన దానినిబట్టి సంస్కృతంలో చంపకమాలావృత్తం ఉందనీ, కాని అది తెలుగులోని చంపకమాలకన్న భిన్నమైన దనీ తెలుస్తోంది. పేర్లకుసంబంధించినంత మటుకు అలంకారశాస్త్రంలో వలె ఛందశ్శాస్త్రంలో కూడాకొంత 'గజిబిజి' కనిపిస్తోంది. తెలుగు ఛందశ్శాస్త్రంలో చంపకమాలకు మూలం ఏదో తెలియడం లేదు. ఇది ఇలా ఉండగా తెలుగులో 'చంపకమాలి' అన్న పేరుతో ఒకవృత్తం కనిపిస్తోంది. అప్పకవి గుర్తించిన దాన్ని గిడుగు సీతాపతిగారు ప్రస్తరించి వ్యాఖ్యానించారు. ఈ ఉదాహరణ చూడండి.

చంపకమాల :

భూమిధరశ్రాంతం_పాలుపారన్
ప్రేమ భమంబులే గో_రి సగందుల్
దాము నుతించున్ నం_దసుతున్ భా
మామకరాంకున్ జం_పకమాలిన్.

[పేజి 93 తెలుగులో ఛందోరీతులు]

గణపతిముని గారి 'చంపకమాలకు' అప్పకవి చెప్పిన 'చంపకమాలికి' గణాలలో భేదం లేదు. యతి విషయంలోమాత్రం భేదం కనిపిస్తోంది. దానివల్ల కొంచెంగతి భేదం కనిపిస్తుంది. అయితే ఈగతి భేదాన్ని పురస్కరించుకొనే, 'చంపకమాలి'కి 'రుగ్మవతి' అని అప్పకవి మరో పేరుపెట్టడం కూడ గమనించవలసిఉంది చూడండి.

రుగ్మవతి :

అంగయతిన్ బొం_దా భమసల్ గు
ర్వంగురుయుక్తిన్_రుగ్మతిన్ స
త్యాంగనకైతేఁ _డాసురశాఖిన్.
బొంగుచు గోపీ_పుత్రుఁడనంగన్.

గణాలచేత నేకాక, యతిచేతకూడ ఇది గణపతిమునిగారి 'చంపకమాలకు' అపరావతార మని గ్రహించగలం.

పై వ్రాతలవలన సంస్కృతభాషలోని 'పంచకావళీ' వృత్తం, తెలుగులో 'చంపకవృత్తం'గా మారిందని, సంస్కృతంలోని 'చంపకమాలావృత్తం' తెలుగులోని 'రుగ్మవతి' లేదా 'చంపకమాలిగా' మారిందని స్పష్టమౌతోంది. *

తాత్త్విక నవల_1.

# అసమర్థుని జీవయాత్ర - హేతువాద నిరాసము

- డా. ఉప్పలపాటి శ్రీరామమూర్తి

(గతసంచిక తరువాయి)

తండ్రి వంశ గౌరవప్రతిష్ఠలను నిలపటమే తన జీవిత ధ్యేయంగా పెట్టుకున్న సీతారామారావుకు జీవితం కత్తులబోను అవుతుంది. అతనికి కావలసినంత అభిమానం. అందువల్లే చేసే ఉద్యోగాన్ని పోగొట్టుకుంటాడు. భార్య నెప్పుడూ కసురుతుంటాడు. ఇతడికి సమాధానం చెబితే ఎదురుమాట్లాడినట్లు, ఏమీ చెప్పకపోతే తనను నిర్లక్ష్యం చేస్తున్నట్లు. తను ఉద్యోగప్రయత్నం చేయడు. మామగారిప్పించిన ఉద్యోగం నిలుపుకోలేకపోతాడు. 'అతడు జీవితం చేతిలో కీలుబొమ్మయ్యేడు' తండ్రిమాదిరి విరళంగా ధనం వెచ్చించడంలో కుటుంబం గడవటం కష్టమైంది. బంధువుల మోసాలకి గురై వాళ్ళమీద ఏహ్యభావాన్ని పెంచుకుంటాడు. దైనందిన జీవితంలో ప్రతివిషయమూ అతనికి ఒకసమస్యగా కనబడుతుంది. ప్రతిదాన్నీ తిరస్కరిస్తూంటాడు. మేనమామ మోసం చేసిన సందర్భంలో డబ్బు,తనవిషయంలో వివాహం, మేనేజరు కూతురి విషయంలో ప్రసూతి, ఉద్యోగం, సంఘసంస్కరణం, రాజకీయాలు, సుఖం. సౌందర్యం_ఇవన్నీ సీతారామారావుకు ప్రశ్నార్థకాలుగా కన్పిస్తాయి. వీటన్నింటినీ ఎందుకు ? ఏమిటి ? అన్నప్రశ్నలు వేసుకుని వాటన్నింటినీ తుచ్ఛమైనవిగా ఎంచి తిరస్కరిస్తూపోతాడు. సీతారామారావు మనస్తత్వం బహువిచిత్రమైంది. తను చదువుకునేరోజుల్లో ఆడవాళ్ళు ఒక పెద్దబస్సు నిండాఎక్కి చదువుకోడానికి వెళ్తుండేవాళ్ళు. వాళ్ళమధ్య కూర్చో బుద్ధయ్యేది అతనికి. తాను కూర్చున్నతర్వాత బస్సు బోల్తాకొట్టాలనీ, ఒకళ్ళకు మొహం దోక్కుపోవాలనీ, ఒకళ్ళ బుగ్గలు చీరుకుపోవాలనీ, ఒకళ్ళకు కాళ్ళు విరగాలనీ అనిపించేది. అట్లా ఊహించుకుంటే... చాలా సంతోషంగా ఉండేది. కానిఅట్లా కోరడంతప్పనీ, ఆభావాన్ని బలవంతంగా అణచుకొనేవాడు. ఇప్పుడు మళ్ళీ అదే భావం వివిధరూపాల్లో బహిర్గతం అవుతూంది. దాన్నిఆపేశక్తి ఇప్పుడతనిలో లేదు. అప్పట్లో జీవితంలో ప్రతివస్తువూ అప్రయోజకంగా అతనికి అగుపిస్తుంది. చూచేదాన్ని చూడు అంటారు వేదాంతులు. చూచేదే తనైనప్పుడు చూచే దాన్నితనెట్లా చూస్తాడు ? అనుకుంటాడు సీతారామారావు. బుద్ధికీ ఇంద్రియ సంవేదనానికీ అభేదం పాటింపబడుతూంది. 'అతనిజీవితం గొడవై పోయింది, తల ఆలోచనల పుట్ట అయింది. తలే కాదు. అతని జీవితమే ఆలోచనల గూడు అయింది. ఎప్పుడూ ముసుగు పెట్టుకుని, పడుకుని, కళ్ళుమూసుకుని బాహ్యప్రపంచాన్ని మరచిపోయి ఆలోచించేవాడు. ప్రశ్నమీదప్రశ్న పుట్టుకొచ్చేది. కానీ ఏఒక్కప్రశ్నకి సరైన జవాబు దొరికేది కాదు'__ సీతారామారావు హేతువాద దృక్పథం ఈవిధంగా పరిణమించింది.

జీవితం మాత్రం ఎందుకు ? అంటాడు సీతారామారావు. 'ఏ ప్రయత్నమూ లేకుండా అలా జరిగిపోవాలి జీవయాత్ర.

లేకపోతే చస్తాం.' అతడి జీవితంలో ముఖ్యంగా తలెత్తిన హేతువాదం.... అనేకకష్టాలుపడి చిల్లర విషయాలకు అనేకమందితో పోట్లాడి బ్రతికిందాని కంటే చస్తేఏం ? ఆపనిమాత్రం మన చేతుల్లో వున్న పనే'—అతని చేతుల్లో ఈ పని అతని ప్రాణాల్ని తీసివేస్తుంది, నవల చివర్లో. 'ప్రాణం అనేది నిర్నిమిత్తంగా ఏర్పడుతుందనీ, పదార్థపరిణామరూపమే ఒకదశలో ప్రాణమౌతుందనీ, నిర్నిమిత్తంగా ఏర్పడి పరిణామం చెందే ప్రాణానికి నిర్దిష్టమైన ప్రయోజనంలేదనీ, అలాంటప్పుడు జీవితానికి ఆదర్శం అనీ ప్రయోజనం అనీ ఎక్కడినుంచి వస్తాయి? అనీ హేతువాద దృక్పథంతో ప్రశ్నించుకున్న సీతారామారావుకు జీవితం శూన్యంగా కన్పిస్తుంది. నిర్నిమిత్తంగా పుట్టాం. నిర్నిమిత్తంగా బ్రతుకడానికి వీలుంటే బ్రతకడం_లేకపోతే చావడం'_ ఇది అతనిధోరణి. అతని మనస్తత్వం సంకుచితమై ప్రపంచాన్ని నిరాకరించేదిగా పరిణమిస్తుంది. సాంఘికవిలువలు తారుమారవుతాయి. అతనిమనస్సు స్వచ్ఛంగా దారులుకొట్టి బ్రతకా లనుకొంటుంది. అతనిలో మానసిక పరివర్తన ప్రారంభమయింది. భార్యను కొట్టడంతో అతనిలోని అంతరాత్మ మేలుకొంటుంది. ఆత్మవిమర్శ చేసుకోవడం మొదలు పెడ్తాడు. సంఘంలోవున్న కట్టుబాట్లు, నియమాలు, ఆచారాలు, న్యాయశాస్త్రాలూ తన మామూలు జీవితానికి అవరోధాలుగా కన్పిస్తాయి. స్వేచ్ఛాజీవితం అతనిలోని మానసిక పరిణామాన్ని బహిర్గతం చేస్తుంది. హేతువాద దృక్పథంపై పరామర్శ గావించుకుంటాడు. 'వీళ్ళు హేతువాదం మీద ఆధారపడమంటార్రా. ఎందుకు ? ఎందుకు ? ఎందుకు ? అని ప్రశ్నించుకోమని చెబుతార్రా. అన్ని ఎందుకులకు వాళ్ళు జ్ఞానాన్ని బట్టి జవాబులు చెపుతారు. మనకున్న జ్ఞానాన్నిబట్టి మనం నమ్ముతాం. కాక ఆఖరి 'ఎందుకు'కి జవాబు లేదురా తండ్రీ ...జ్ఞానం ఎందుకు ?...జవాబులేదు. లేకపోతే ఆనందానికి అంటార్రా...ఆనందం ఎందుకు ?...జవాబులేదురా నాతండ్రీ! ఎక్కడో ఓచోట ఈ 'ఎందుకు' ఆగవలసిందే నా తండ్రుల్లారా !! ఒరేయ్, లేని ఈఎందుకు ఎందుకు సృష్టించారో... తెలుసట్రా ? ఎందుకో ఒకందుకని చెప్పకపోతే మనం ఏంపనీ చెయ్యమని వాళ్ళ వుద్దేశం రా...మనం పుట్టటం నిజం. చావటం నిజం. మధ్య బతకటం నిజం. పుట్టటం చావటం మన చేతుల్లో లేదురా! బతకటానికి కావలసింది అన్నమే గదరా. దీని కింతగొడవ ఎందుకురా... ఈ ప్రపంచంలో ఏమో వుందని మభ్యపెట్టి దాని కోసం పోట్లాడుకుచచ్చేట్లు చేస్తున్నార్రా ...ఎవరూ కట్టుకపోయేది ఏముందిరా. బతకండ్రా తండ్రుల్లారా. చచ్చేదాకా బతకండి.' జీవితాన్ని గూర్చిన అవగాహన సీతారామారావులో మొట్టమొదటిసారిగా పొడసూపింది. వేదికపై దెబ్బలు తిని రామయ్యతాత ఆదరాన్ని పొందుతాడు. రామయ్యతాతతో బాటు గన్నేరుచెట్టు క్రిందకు సీతారామారావు చేరతాడు. దూరంగా వంతెనను చూస్తుంటే సీతారామారావులో జీవితంలోని భిన్నత్వంలోని ఏకత్వాన్ని చూడగల్గిన నూతన దృక్పథం ఏర్పడుతుంది. ఒకవాదం మరొకవాదాన్ని రూపుమాపటం లేదు. వివిధదశలకు సంబంధించిన ఎడ్లబళ్ళూ, గుర్రాలూ, కార్లూ అన్నీ సంఘంలో ఉంటూనేఉన్నై. అన్నిటి అవసరం ఉంటూనే వుంది. మానవసంఘం...పశుదశనుదాటి, ఆధ్యాత్మిక వాదంలోకి, ఆధ్యాత్మికవాదాన్ని దాటి భౌతికవాదంలోకీ, అభివృద్ధిచెందుతూ వుందనుకుంటూ డతను. మానవసంఘం ఎన్నిదశలు దాటినా, ఎంతపరిణామం చెందినా, అన్నిదశలకు సంబంధించిన లక్షణాలూ ఎప్పటికప్పుడు సంఘంలో వుంటూనే వున్నై. ఈఅన్నిలక్షణాలనూ కలుపుకునే సంఘం వృద్ధిచెందుతూవుంది. ఇన్నాళ్ళు తానుదేనికోసం వెదుకుతున్నాడో ఆ ప్రపంచస్వభావం తన కర్థమయిందనుకుంటూ డతను. ప్రపంచాన్ని విడివిడిగా చూడకుండా ఒకటిగా చూడగల్గుతున్నాడు. రామయ్య జ్ఞానబోధ అతనికి బాగా ఉపకరిస్తుంది. సీతారామారావుకు ఒక దశనుండి మరో దశకు సంఘం ఎలాపురోగమిస్తుందీ రామయ్యతాత జ్ఞానబోధతో అర్థం అవుతుంది....మానవుడీ విధంగా అభివృద్ధిచెందుతూపోతే ఒకప్పటికి సంఘానికి దోహదం ఇచ్చే పనులే వ్యక్తికి ఆనందాన్నీ తృప్తినీ ఇస్తాయి. అప్పుడు మానవుడు ఆపనులు తప్ప మరొకటిచెయ్యడు. అపుడు 'ఎందుకు' అనే ప్రశ్నకు తావు లేదు. ఎందుకనే ప్రశ్న మానవునిచే మంచిపనులు చేయించటానికి సహాయకంగా ఉంటానికి పుట్టింది. మానవునికి మంచిపనులు చెయ్యటమే స్వభావం అయినప్పుడు ఈ ఎందుకు యొక్క అవసరం క్షీణిస్తుంది; లేకుండాపోతుంది. 'ప్రకృతిశక్తుల్ని పూర్తిగా అర్థంచేసుకున్నాక ప్రకృతికీ మానవునికీ సంఘర్షణ వుండదు. సాంఘికపరిణామమే మానవునికి ఆనందంఇచ్చే మనస్తత్వం కలిగినాక, సంఘానికీ మానవునికీ సంఘర్షణవుండదు. మానవునిలో విరుద్ధశక్తుల సంఘర్షణ వుండదు. మానవుడు పరిపూర్ణమానవు డవుతాడు'. సంఘంలో వర్గపోరాటాలూ పరస్పర సంఘర్షణ మొత్తం సాంఘిక పరిణామానికే దోహదం చేస్తుంటాయి.

సీతారామారావు హేతువాద దృక్పథాన్ని జీవితంతో సమన్వయ పరచి చూచుకోనేట్లు రామయ్యతాత జ్ఞానబోధచేస్తాడు. జీవితం ఎందుకు ? అన్న ప్రశ్న జీవించడానికే అని సమాధానం అతడికి చెబుతుంది. తండ్రి సంక్రమింప

చేసిన ఆ పాతదృక్పథం తొలగిపోయి నూతనమయిన మానసిక పరిణామం సీతారామారావులో కల్గింది. ఇదే అతను స్మశానంలో తన నీడమీద సాధించిన విజయం. నీడమీద విజయం సాధించడం ద్వారా సీతారామారావు ప్రాణాలు పోగొట్టుకుంటాడు.

అసమర్థునిజీవయాత్రనవల వ్రాసిన పది హేను సంవత్సరాల తర్వాత, గోపీచంద్ వ్రాసిన ఈ క్రింది వాక్యాలు ఆ నవలకు చక్కని వ్యాఖ్యానంగా మనకు కన్పిస్తాయి. తర్కానికి అందకుండా ఉండి మానవుని అనుభవంలోకి వచ్చే అనుభూతులు కొన్ని ఉన్నాయి. మానవునిచే అనేక కార్యాలను చేయించే స్వాభిమానం అనే గుణంఉంది. వీటిని వేటినీ అజలోకి తీసుకోదు హేతువాదం. అందువల్ల సత్యసాధనకు అది పూర్తిగా ఉపకరించదు.... హేతువాదం మనోవీథిలో ఉన్నంతవరకు ప్రమాదంలేదు. అప్పుడది విభిన్నదృక్పథాలనూ, సిద్ధాంతాలనూ కొంతవరకు సహిస్తుంది. ఒకదానితో ఒకదాన్ని పోల్చిచూచుకొని సామరస్యం కోసం ప్రయత్నిస్తుంది.మారుతుంది,విశాలపడుతుంది. ఉన్నతిని పొందుతుందికాని, జీవితంలో అడుగుపెట్టి పరిపాలించటానికి పూనుకొనేటప్పటికి సిద్ధాంతంగా తయారై గిడసబారి ప్రతి అభివృద్ధికలయికకూ అడ్డుగా నిలిచి నిరోధిస్తుంది. సామరస్యానికి కాక సంఘర్షణకూ,రక్తపూరిత విప్లవాలకూ దారితీస్తుంది. హేతువాద దృష్టిలోనుండి బయటపడి జీవితాన్ని సమన్వయ దృష్టితో చూచుకొన గల్గిన సీతారామారావు వాస్తవిక జీవితచిత్రణమే అసమర్థుని జీవయాత్ర నవల.

---

# "రసిక్" కూనలమ్మ పదాలు

- రత్నశ్రీ (యస్. రాజశేఖర్, బి. ఏ)

16-9-78 సంచికలో 'ఆరుద్ర' కూనలమ్మపదాలు వ్యాసం చదివారు. ఇపుడు ఆరుద్రముద్రతో రసిక్ గారు వ్రాసిన కొన్ని కూనలమ్మ పదాలు చదువబోతున్నారు. మరుగు పడిపోయిన జానపద గేయాల వలెనే కూనలమ్మ పదాలను వెలుగులోకి తెచ్చి, ఆ, పాతపదాలకు రమణీయమైన ఛందస్సులో ఆధునికంగా పదాలు రచించి, రసిక్ వంటివారు వ్రాయడానికి అవకాశము కల్గించాడు ఆరుద్ర. ఆధునిక కూనలమ్మ పదాలకు ఆద్యుడు ఆరుద్ర.

'ఈ కూనలమ్మ పదాలు చదివే వాడికి చాలా సులభంగా వ్రాయడానిక్కి వీలుగావున్నట్టు కనపడతాయి గాని 'మోసే వాడికి తెలుసు కావడిబరువు' అన్న సామెతగా ఛందో నియమాన్ని, అంత్యప్రాస నియమాన్ని తు. చ. తప్పకుండా పాటిస్తూ ప్రతిపదంలో ఆలోచనా మృతాన్ని నింపడం అతి కష్టసాధ్యమైన విషయం' అని 'రసిక్' కూనలమ్మ పదాలకు పీఠిక వ్రాస్తూ డా॥ దాశరథిగారన్నారు.

ఆరుద్ర కూనలమ్మ పదాల చేత ప్రభావితులై వ్రాసిన చాలమంది రచనలు కేవలం అనుకరణలుగానే నిలిచి పోయాయి కాని ప్రత్యేకతను చూపించ లేకపోయాయి. డా॥ దాశరథి గారు పీఠిక వ్రాస్తూ 'ఆరుద్ర పదాలు సూర్యకాంతి అయితే రసిక్ గారి పదాలు-సూర్యకాంతిని జీర్ణించుకుని చల్లని వెన్నెల నిచ్చేచంద్రునిలా అనిపించాయి నాకు.' మను చరిత్ర మీద శ్రీనాథుని ప్రభావం, వసుచరిత్రకారుని మీద పెద్దన ప్రభావం వంటిదే 'రసిక్' మీద ఆరుద్రప్రభావం.

'అతడు చూపిన దారి
అను గమింతును కోరి
లలిత సూక్తుల నేరి
ఓ కూనలమ్మా. (మకుటం).'

అన్నాడు రసిక్, ఆరుద్ర చూపినదారిని అనుసరిస్తూ,కృతజ్ఞతాసుమాలు అర్పిస్తూ. దారి ఆరుద్ర చూపినదే అయినా నడక రసిక్ దే.

ఇంతకీ 'రసిక్' అంటే ఎవరని, పాఠకులకు సంశయం కల్గవచ్చు. డా॥ గుఱ్ఱం భానుమూర్తి గారు. ప్రఖ్యాత న్యాయమూర్తులు, విద్వత్ కవులూ అయిన శ్రీ వేంకట సుబ్రహ్మణ్యం గారి పుత్రులు. రసిక్ గారింట కవిత్వం వారసత్వంగా వస్తోంది.

రసిక్ నాందిలో ఆరుద్ర ముద్రతో ప్రజల్ని మేల్కొలపడానికి వైతాళిక గీతం ఆలాపిస్తున్నాడు. తన సొంత గొంతుతో.

'చూపినా డారుద్ర
సొంపైన తనముద్ర
మేల్కొంచె ప్రజ నిద్ర.'

కవి కర్తవ్యం నిద్రాణమైన జగతిని తట్టి లేపడమే. తప్పుదారిని నడిచే వారికి కనువిప్పు కల్గించడమే. నీతిని జ్యోతిగా వెలిగించి, ప్రగతి పథంలో తన కవితా రథాన్ని నడిపించటమే, తన కర్తవ్యం. ధర్మాన్ని ప్రతిష్ఠించడం, సంస్కృతిని ప్రతిబింబించడం కవిలక్షణం. హృద్యమైన పద్యం వ్రాసినా, వచన రచన చేసినా; అందం, ఆనందం దాని పరమావధి. ఆదికవి చెప్పినా ఆరుద్ర చెప్పినా, వీరేశలింగం చెప్పినా, విశ్వనాథ చెప్పినా ప్రజల్ని సన్మార్గంలో నడిపించడానికే. చైతన్యవంతుల్ని చేయడానికే.

ఆరుద్ర సూర్యుడు, రసిక్ చంద్రుడు అయితే ఇద్దరూ కావాలి మనకు. ఇద్దరూ ఆనంద ప్రదాతలు. వేడిగాలి కావాలి చల్లని సమీరం కావాలి. ప్రకృతి

రెండూ అవసరమే. ఆరుద్రకంటె రసిక్ ఒకడుగు ముందు కేశాడు, ఆరుద్ర చేయని 'విషయవిభజన' చేసి రసిక్ ఇంచుమించు అన్నివిషయాలకు తన పదాలను ప్రాతినిధ్యం వహింపచేశాడు. 15 శీర్షికలక్రింద 129 పదాలు చెప్పాడు. రసిక్ సరసుడు, సహృదయుడు కాబట్టి ఇతర కవుల గొప్పని చూసి ప్రశంసించాడు, షేక్స్పియర్ ని మెచ్చుకున్నాడు, షెల్లీని ప్రశంసించాడు, మహాకవులకు తన సాహితీ వందనాలు సమర్పించాడు. 'నానృషిః కురుతే కావ్యం' అన్నమాట అతని కవితలో ప్రతిచోట ప్రస్ఫుటంగా కనిపిస్తుంది-కవిత్వం వ్రాయాలంటే ఏదో ఒక మథన, తపన ఉండాలి. ఎదను కదిలించే మధురమైన సన్నివేశము, బాధాపూరిత ఆక్రోశమూ ఉండాలి. అనుభవం ఉండాలి, ఆర్ద్రహృదయం ఉండాలి.అప్పుడే కవిత జనిస్తుంది.

'అనుభవమ్ములు పండి
ఆర్ద్రహృదయము నుండి
కదలు కవితల బండి.'

కవిత్వం ఒక వ్యవసాయం, దాని ఫలసాయం కీర్తిగడించడం.

'కలముదున్నెడి హలము
కవితబంగరు పొలము
యశము ప్రాపిలు ఫలము'

ఎంత మధురంగా చెప్పాడు కవితాలక్షణాన్ని. సాహిత్యం యొక్క ఔన్నత్యం గుర్తించినవాడు, సాహిత్యాన్ని నిర్వచించదగినవాడు, కవిత్వాన్ని బాగా మథించినవాడు, కాబట్టి చక్కని విషయాన్ని చెప్పాడు. కవిత్వం జీవితానికి ఒక వ్యాఖ్యానమే. కవిత్వం ఆనందసంధాయియే, కాని జీవనాధారం కాదు. కొంతమందికి జీవనాధారం. అయితే దాని వల్ల ప్రయోజనం ఏమిటంటే మంచి కీర్తి కేవలం కవిత్వంవల్లే వస్తుందా, అంటే అనేక-ఇతర కళల వల్ల కూడా వస్తుంది. కవిత్వం వ్యక్తికి దివ్యత్వాన్ని ప్రసాదిస్తుంది.

'కవన మల్లుట వల్ల
కాసు దొరకుట కల్ల
కీర్తియో కోకొల్ల'

కవిని గౌరవించాలంటే అతని కృతులు చదివి ఆనందిస్తే చాలు. అంతేకానీ కనకాభిషేకాలు, గజారోహణలు చేయడం కాదు.

'కవి కేల బిరుదాలు
కనకాభిషేకాలు
కవిత మెచ్చిన చాలు.'

కవిత, వనిత వాటంతట అవే వలచి రావాలికాని, వాటిని పట్టితెచ్చుకున్నా, తెచ్చి పెట్టుకున్నా, రసహీనములు, నీరసములు అవుతాయి. కవిత, వనిత, లలితమైనవి, అందం ఆనందం కందళితమైనవి; సమ్మిళితమైనవి. ఇక్కడ డా॥ బోయి భీమన్నగారి మాట గుర్తుచెయ్యడం తప్పు కాదనుకుంటాను.

'రమణీయ రాగజ్యోత్స్న వనిత
దాని ఆనంద పారవశ్యమే కవిత.'

రసిక్ గారు కవితా, వనితలకు సమానమైన స్థానం ఇచ్చారు. ఆయన దృష్టిలో రెండూ సమానం.

'కాంత పెన్నిధి కన్న
కవిత పెన్నిధి కన్న
కోరదగ్గది సున్న'

ఉమర్ ఖయ్యాం కూడా ఈ విషయాన్ని చెబుతాడు తన 'రుబాయత్' లలో.

ఈరోజుల్లో అచ్చు అయ్యే కథలలో చచ్చు కథలు హెచ్చుగా ఉన్నాయి; వస్తున్నాయి. మంచికవిత్వాన్ని అందించే వారు చాల తక్కువమంది.

'చచ్చు కథలే హెచ్చు
అచ్చులో కనవచ్చు
కవిత నెవ్వడు మెచ్చు.'

కొంతమంది నవలాలు (స్త్రీలు) తీరిగ్గా కూర్చుని నవలలు సృష్టించేస్తూంటే సాహిత్యం వారిచేతుల్లో పడి, గిలగిల కొట్టుకుంటోంది. ఈమధ్య స్త్రీల రచనలు పుంఖానుపుంఖాలుగా వస్తున్నాయి. ఉత్తమమైనవి కొన్నిమాత్రమే ఉన్నాయి.నవలా చేతులతో సృష్టిస్తున్న నవలలు, యువతరానికి రంగురంగుల కలలు, నిజానికి చాల దూరాలు.

'రచయితల కిక స్వస్తి
రచయిత్రులే జాస్తి
రచనలో పస నాస్తి'

నిష్పక్షపాతంగా, ముగమాటంలేకుండా నిజాన్ని చెప్పే సత్తా, ధైర్యం రసిక్ కు ఉన్నాయి. లోకానికి భయపడడు. ప్రతిస్త్రీ ఒక కవయిత్రిగా మారిపోతోందంటే సాహిత్యపువిలువలు ఎంత దిగజారి పోతున్నాయో వేరే చెప్పనక్కర్లేదు. ఇక్కడ స్త్రీ, పురుష భేదం కాదు. స్త్రీలమీద ఏమాత్రం ద్వేషం లేదు. ఇది నిజం, అక్షరాల పచ్చినిజం. చెత్తరచనలు చేసే మగవాళ్లు లేరా? అంటే ఉన్నారు. అయితే స్త్రీలు ఎక్కువమంది. వారి నవలలే చలామణీ కావడం మనదురదృష్టం. సాహిత్యానికి పట్టిన దౌర్భాగ్యం ఇది.

'ప్రతికలికి కవయిత్రి
ప్రతిరసుని రచయిత్రి
తరియించు లే ధాత్రి.'

స్త్రీలను విమర్శించడం రసిక్ లక్ష్యం కాదు. అయితే నిజాన్ని ఎలుగెత్తి చెప్పటమే అతని ధర్మం.

రమణి ఒక వెలుగు నిచ్చేమణి. అది లేకపోతే మగవాడికి మెరుగు తగ్గుతుంది. అందమైన దయిత, సుందరమైన, సుమనోహరమైన కవితలాంటిది. ఆమె చేతిస్పర్శ మగాడి జీవితాన్నే మార్చివేస్తుంది.

'వేప పచ్చడి కూడ
వెలది వడ్డన తోడ
తీపు నింపదె చూడ'

పైమాట అనుభవంమీద చెప్పిందే. అందటి స్త్రీలహస్తాలు అమృత హస్తాలు కావు సమస్తాన్ని బంగారంగా మార్చలేవు. కొందరు స్త్రీలు పైకి మంచిగా, తియ్యగా తేనెలు కురిపిస్తూ మాట్లాడుతూ, మనస్సులో విషం కక్కుకుంటారు.

'వెన్న పెదిమలపైన
విసము గుండెలలోన
నిలుపుకున్నదె చాన'

ప్రముఖ చిత్రకారుడు బాపు బొమ్మల్లో జీవం ఉట్టి పడుతుంది.

ఆరుద్ర బాపును ప్రశంసించాడు.

'కొంటె బొమ్మల బాపు
కొన్ని తరముల సేపు
మనసు ఊయల లూపు'

రసిక్ కూడా బాపుగొప్పదనాన్ని ప్రస్తుతించాడు.

'కొమ్మ, మామిడికొమ్మ
కాదు-దానిమ్మ రెమ్మ
కాదు-బాపూ బొమ్మ.'

ఈనాటి కాలేజీ అమ్మాయిని గురించి రసిక్ ఏమంటాడంటే

'వేషమందబ్బాయి
వాగినోసన్నాయి
కాలేజీ అమ్మాయి.'

అమ్మాయిలకీ అబ్బాయిలు ఏమీ తీసిపోరు, షోకుల్లో, అల్లరిలో, అన్నిటిలోను. అందుకే అన్నాడు ఒక ఆధునిక కవి అబ్బాయిలను గురించి

'చదువులో జీరో
రాజకీయాల్లో హీరో
రోడ్డుసైడు రోమియో
వెకిలివాగుడు రేడియో!'

(సశేషం)

ఊరపరాజు శ్రీధరరాయకవి

# విశ్వనాథ సాహిత్య విమర్శ

— శ్రీ శివలెంక ప్రకాశరావు, ఎం. ఏ.

(గతసంచిక తరువాయి)

ఉదాహరణ వాఙ్మయ చరిత్రము :-

శ్రీ నిడదవోలు వెంకటరావుగారికి విశ్వనాథవారు వ్రాసినలేఖ (7-2-51) చిన్నదయినా చాలావిశిష్టమయినదని చెప్పవచ్చు. "ఉదాహరణ వాఙ్మయము యొక్క గొప్పదనమిట్లనుకొనుచుందును. జగత్తంతయుఁ గ్రియారూపము. సర్వక్రియయుఁ బరమేశ్వరునందుఁ బర్యవసించును. ధాతువు సర్వదా విభక్త్యాశ్రయము. ఏవిభక్తితో సంబంధములేక క్రియలేదు. అందుచేత నన్నివిభక్తులతోఁ బరమేశ్వరునిఁ జెప్పినప్పుడు భగవంతుడు సర్వక్రియాస్థానభూతుడని వ్యంగ్యము. ఇది యుదాహరణ కావ్యరహస్యము" అని తమ అభిప్రాయం వెలిబుచ్చారు.

ఎమెస్కోవారు ఈమధ్య సంప్రదాయసాహితి' అనే పేరుతో ప్రచురించిన ప్రాచీన ప్రబంధాలు పదింటికి విశ్వనాథవారు పీఠికలు వ్రాశారు. మచ్చుకు కొన్నింటిని పరిశీలిద్దాం.

మనుచరిత్ర : పెద్దన విశిష్టతను చాటి చెపుతూ 'అష్టదిగ్గజములలో అల్లసాని పెద్దన తూర్పుదిక్కునఉన్న ఏనుగువంటివాడు. తెలుగుభాషలో పండితుడనగా మనుచరిత్ర చదివి తీరవలెను...' అని ఖండితంగా తెలిపారు.

విశ్వనాథవారి శైలి కొరుకుడుపడని కొబ్బరికుక్కవంటిదని పలువురి అభిప్రాయం. వారి పద్యరచన ఎంత ప్రౌఢంగా ఉంటుందో గద్యరచన కూడా అలాగే ఉంటుందని అనుకోవడం పొరబాటు. చిన్నపిల్లడికికూడా అర్థమయేటట్లుగా వ్రాసిన ఈపీఠిక చూడండి ఎంత సరళంగా, ద్రాక్షాపాకంలో నడిచిందో ;

'అనగా అనగా ఒకఊరున్నది. ఆ యూరిపేరు అరుణాస్పదము. ఆయూరి ప్రక్కనే ఒకనది యున్నది. దానిపేరు వరుణ. వారణాసి యన్నపేరు విన్నాము కదా!...' (19 పే)

పారిజాతాపహరణము :- 'తనదు కోడండ్రలోన...నాకింక సిగ్గు గాదె !' ఈకథలో నున్న యాయువు పట్టంతయూ నీపద్యములో నున్నది' (19) అని ముఖ్యమైన పద్యాలు వ్యాఖ్యానించి, 'కథంతా మొదటి ఆశ్వాసంలోనే అయిపోయింది. మిగిలినవి అనవసరంగా తిమ్మన పెంచాడు' అని వాదించేవారిని దృష్టిలో పెట్టుకొని విశ్వనాథవారు భగవంతుడయిన భర్త తనకొక్కరుకకే చెందునని గర్వించే సత్యభామతో చేసేసంసారమెట్లా ఉంటుందో, తెలియచెప్పే కథాసౌధానికి మొదటిఆశ్వాసం పునాది అని అన్నారు. ఈకావ్యానికి సత్యభామ సంసారం అనిపేరు పెట్టాలనీ, ఇందులో ప్రథమాశ్వాసంలో శృంగారరసంవలె కనిపించే విషయంతప్ప, ఏరసంలే దనీ, 'ఇది ధనవంతమైన యొక తెలుగుకుటుంబములో సుఖముగా బ్రతికెడి భార్యాభర్తల జీవన' మనీ ప్రకటించారు వారు (20 పే)

అంతేకాక మొదటిసారి కావ్యంలో బంధకవిత్వం వ్రాసింది ముక్కుతిమ్మనయే యేమో అని ఆశంకించి, ఈ కావ్యం పారకుని రసలోకాలకు తీసుకొనిపోకపోయినా అతడు సుఖపడతాడని చెప్పారు (30 పే)

కాళహస్తి మాహాత్మ్యము :- ఈ కాళహస్తి మాహాత్మ్యమువంటి గ్రంథము తెలుగులో మరియొకటి లేదు...తక్కిన వారి కవిత్వము మనస్సునకు వాడిపెట్టి

హృదయమును పాటునకు తెచ్చును. ఈ కవిత్వము మనస్సువాడిమిని దాటి గుండె యొక్క పాటుదాటి, దూరాన శివుడు కనిపించునట్లు చేయును. ఇది ఈ కావ్యము యొక్క విశేషము' అని విశ్వనాథ ఈ కావ్యంలోని ఆయువుపట్టును పట్టి చూపించారు.

**హారవిలాసము :-** ఇందులో మొదటి రెండాశ్వాసాల యందున్న చిరుతొండ నంబి వంటి అందమైనకథ శ్రీనాథుడెక్కడా వ్రాయలేదని ప్రకటించారు విశ్వనాథ.

మానవుల ప్రాణములు గాలిలో కలిసిపోయినా ఉపాసకుని ప్రాణాలు జీవశక్తితో దేవతాభావం కలిగి ఉండి నాలుగుదిక్కులలో తిరుగుతుంటా యనీ, తిరువెంగనాంబి పిలిచినప్పుడు సిరియాలుని ప్రాణాలు తిరిగిరావడానికిదే కారణమనీ, వేదంలో ఉన్న మహార్థాన్ని శ్రీనాథుడిందులో ప్రవేశపెట్టాడనీ వివరించారు. అలాగే పార్వతీపరమేశ్వరుల కథను జాగ్రత్తగా పరిశీలిస్తే లోకంలో ఇల్లరికమున్న ఒక అల్లుడు పొందే అనుభవాలు, చివరకు విసుగెత్తి భార్యతో వేరేకాపురం పెట్టుకోవడం వంటి విశేషాలు స్ఫురిస్తా యని అంటారు విశ్వనాథవారు.

సముద్రమథనం ప్రతికల్పంలోనూ జరగడం సృష్టిలక్షణమని ఈ కావ్యంలోని ఆరవఆశ్వాసం వ్యాఖ్యానిస్తున్నదనీ, శివుడర్జునుడికి పాశుపతాస్త్రం ఇవ్వడంలో పరమశివలీలావిలాసం ఉన్నదనీ, విలాసం అంటే పరమేశ్వరుడొకభక్తుని అలౌకికమైనదయతో రక్షించడం కాబట్టి హారవిలాసాదులకు తగినట్లు 'విజయవిలాసం'అనడంలో సరిపో దనీ సత్యనారాయణగారు విమర్శించారు.

**ఆముక్తమాల్యద :-** 'ఈ గ్రంథము పేరు ఆముక్తమాల్యద...'ఆముక్త' అలంకరించుకోబడిన, 'మాల్య'-పూలదండను, 'ద'-ఇచ్చునది. అనగా ఒకభక్తురాలు పూలదండను గ్రుచ్చి మొదట తాను అలంకరించుకొని, తరువాత భగవంతుని మెడలో వేసెడి దట !...ఇది ఆవిడ యొక్క కథ! 'మాల్యద'-సరే! ఆముక్త ఏమిటి? ముక్త-అనగా వదిలిపెట్టబడిన దానివెనుక 'ఆ' చేర్చునప్పటికి అలంకరించుకోబడిన అని యర్థమువచ్చుచున్నది. వదిలిపెట్టబడిన, అలంకరించుకోబడిన - ఈ రెంటికి నెంత అర్థభేద మున్నది? ఈ 'ఆ' అన్న దానిని ఉపసర్గయందురు, సంస్కృతములో ధాతురూపములకు ఈ ఉపసర్గలు చేర్చినచో కొన్నిచోట్ల అర్థములు భేదించును. అనగా వేఱే అర్థములు వచ్చును' అని కావ్యనామం వ్యాకరణరీత్యా వ్యాఖ్యానించారు విశ్వనాథవారు. విమర్శించే పద్ధతులలో ఇది ఒకటి.

'కవిత్వమునందు రెండులక్షణము లుండును. మొదటిది శబ్దములు, కూర్పు, బిగింపు, గడుసుదనము, పలుకుబడి, ఒక శైలి-యిటువంటిది. రెండవది - భావము కల్పన, అలంకారములు సమకూర్చుట, కథను చెప్పెడి నేర్పు మొదలైనవి. ఈ ఆముక్తమాల్యద ఈ రెండు మార్గముల లోను దానికదే సాటియైన గ్రంథము. ఇందులోని మాటల కూర్పు తెలియని వారికి వెగటుగా నుండవచ్చును. మాటలన్నియు నొకటియే. కూర్చెడికూర్పులో నన్నియుఁ గ్రొత్తవిగా కన్పించును. ఒకడు ఎప్పటిదుస్తులుగాక వేఱు దుస్తులు వేసికొనవచ్చును. వానిని చప్పున గుర్తుపట్టలేము...'అంటూ చక్కని చిక్కని ఉదాహరణలతో శాస్త్రచర్చ కూడా చేయడం విశ్వనాథవారి విమర్శల్లో కనిపిస్తుంది.

**ప్రసన్న కుసుమాయుధము:-** ఆచార్య యస్వీజోగారావుగారిచే విరచితమైన ఈ కావ్యరాజమునకు విశ్వనాథ వారు ముప్పదిపేజీల పీఠిక వ్రాశారు (1973) ఇందులో ప్రతివిషయాన్నీ తీసుకొని చాలాఉదాహరణలిస్తూ తలస్పర్శిగా విమర్శించారు.

శాస్త్ర విషయ చర్చ చేస్తూ 'శైలి యనగా నేమి?' అచటి యక్షరమునుదీసి మరియొక యక్షరమును బెట్టినచో నది చెడిపోవు నట! ఇది శైలియొక్క నిర్వచనము (5 పే) అనీ, కావ్యములోని ఆయువుపట్టునుగూర్చి వివరిస్తూ, యుద్ధవీరుడు, క్రతువులు చేసినవాడు, కీర్తిగలవాడు మొదలైనవారు స్వర్గలోకమునకు పోవుదురు. అచటివారికి రంభాద్యప్సరస్సంయోగము లభించును.-అన్నది పురాణమన్నది. ఈ ప్రసన్నకుసుమాయుధము ప్రధానముగా తత్త్వమును దృష్టిలో బెట్టికొని ఈ పురాణ కథలలోనున్న యర్థములను బ్రధానముగా దీసికొని వ్రాయబడిన విలక్షణమైన కావ్యము (3 పే)' అనిరి. తరువాత పూర్వకావ్యపద్యరచనావైఖరులలోని విశిష్టత ప్రస్తావించబడింది. శ్రీనాథాది మహాకవుల శైలీభేదములు సోదాహరణంగా వివరించబడినాయి. భాషావిశేషములు, శబ్దచమత్కారములు, సమాసగ్రథనంలోని చమత్కారాలు, లోకోక్తులు ఇత్యాది కావ్య విశిష్టతను చాటు విషయాలను విశ్వనాథవారు వ్యాఖ్యానించారు. ఈ కావ్యంలో మొదటనున్న శుభాకాంక్షలూ, ప్రరోచనలోఉన్న పద్యరచనావైశిష్ట్యమూ కొనియాడారు.

విమర్శించుటలో విశ్వనాథవారు అప్పుడప్పుడు హాస్యంపాలు కలుపుతూ ఉంటారు. అది వారి ప్రౌఢవిమర్శనాధోరణిని కొంచెం సమతూకంగా, ఆహ్లాదకరంగా మారుస్తుంది. ఒక చిన్న ఉదాహరణ-'ఈకవికి కవులలో శ్రీనాథుడన్నచో, నప్సరసలలో నూర్వశియన్నచో పట్టరాని మమత. శ్రీనాథునిమీది మమత అతని పద్యరచనావైలక్షణ్యము చేత, మాధుర్యముచేత పలుమందికిగలదు.

ఈయూర్వశిమీఁది మమత దేనికో తెలియదు. మీ కవి అప్సరసల నందరినీ యెఱిఁగినట్లున్నాఁడు. వారి తారతమ్యములు కొలిచినట్లున్నాఁడు.' (13 పే)

తరువాత ఒక్కొక్క భాగంలోఉన్న కవితావిశేషాలను సోదాహరణగా విమర్శించి కావ్యపరమార్థమునుగూర్చి వ్రాస్తూ నేటిస్థితిగతుల్ని వ్యాఖ్యానించారు.

'ఒకదృష్టితోఁ జూచినచో పద్యము, పద్యరచనాశక్తి, తద్గతప్రతిభ, దాని సౌందర్యము, దానిశిల్పము మొదలైనవి గ్రహించగలశక్తి దేశమునందు నానాటికి క్షీణించుచున్నది. ఇంతేకాదు 'స్థితస్య గతిశ్చింతనీయా' అన్న నానుడి ఒక విలక్షణమైన సందర్భమునందు జెప్పబడినది. ఆ వైలక్షణ్యమును దొలగించి చూచినచో నున్నదానిని యథాస్థితికముగ బరిశీలింపవలయు నని యర్థము. పాఠకుఁడొక గ్రంథమును చేతిలో గ్రహించినపుడు ఆగ్రంథమునందు బహుగుణములున్నపుడు తనకున్న యితరములైన ఊహలను బరిత్యజించవలెను. పాఠకునకు లక్షయూహాలు రావచ్చును. వాని యిష్టానిష్టములు లక్ష లుండవచ్చును. వాని ప్రసక్తి ఆ గ్రంథమునందు లేదు. ఇట్లు చూచినచో నీగ్రంథము విలక్షణమైన చిత్రమైన యొక యద్భుతమైన శృంగార రసపర్యాలోచన చేయబడిన కావ్యరాజము. శృంగారరస దేవతయొక్క శరీరవైభవము సంపూర్ణముగా నీగ్రంథమునందు గలదు. దీనియంతట నిది పరభావముల జోక్యములేనిచో మహాగ్రంథము. దాని శాశ్వతత్వము దానిదన్నది. మహాంధ్రసారస్వతమున నిట్టిగ్రంథము నీ దృష్టితోఁ జూచినచో మఱియొకటి లేదు. అట్టి స్వచ్ఛమైన భావుకబుద్ధులు కలవారున్నన్నినాళ్ళు ఈగ్రంథమునకుఁ జలనము లేదు... 'మహాంధ్రకావ్యసరస్వతీస్వరూపములో నిది యొక విలక్షణమైన క్రొత్త కూర్పు. పొగడినాఁ డని తేలికగా ననవచ్చును. ప్రయోజనము వాంఛించెడి వాఁడు పొగడును. నాకర్మ మేమి కాలినది ? ఒకవిలక్షణమైన యథార్థము నాకు తోచినది చెప్పుచున్నాను' (29-30 పే)

పైని వ్రాసినదానిలో విశ్వనాథవారి నిస్సంకోచతా, పాఠకుని కుండవలన లక్షణాలు స్పష్టంగా కనిపిస్తాయి. సత్యనారాయణగారికి ఎంతగానో నచ్చితే కాని ఇంత విమర్శనాత్మకమైన పీఠిక వ్రాయరు. (సశేషం)

# తెలుగుకవితకు జీవంపోసిన శేషేంద్ర

- శ్రీ డా. తంగిరాల వెంకటసుబ్బారావు, ఎం.ఏ., పిహెచ్.డి.

(గత సంచిక తరువాయి)

5. యుగకవిత్వదశ: (నాదేశం - నా ప్రజలు)

శేషేంద్ర కావ్యాలన్నీ ఒకయెత్తు, 'నాదేశము-నాప్రజలు' అనే ఆధునిక మానవేతిహాసం ఒక్కటీ ఒకయెత్తు. దీంట్లో ప్రతిపంక్తిలోను కవిత్వం వుంది. మనజాతిజీవనాడియైన, మన నాగరికతకు మూలభూతమైన కర్షకుని జీవితమే దీని యితివృత్తం. ఇందులో వేదాంతంతో మానవతావాదం సమన్వయం చేయబడింది. ఇంతవరకూ మార్క్సిజంయొక్క పూర్వార్థమైన భౌతికవాదంలో కూరుకుపోయిన అభ్యుదయ కవిత్వాన్ని ఈ ఆధునికేతిహాసం మార్క్సిజం యొక్క ఉత్తరార్థమైన భావవాదంతో ప్రవేశపెట్టింది. 'నాదేశం-నాప్రజలు' వచన కవిత్వం కాదు 'ప్రవచన కవిత్వం' (Prophetic Poetry) అన్నారు సుదర్శనంగారు. ఋతుఘోషలో వైయక్తిక వేదనతో ప్రారంభమైన శేషేంద్ర కవితాప్రస్థానం, ఈకావ్యంతో ఆకాశమంత సువిశాలమయింది. అసలు శేషేంద్ర తాను తెలుగుకవిని మాత్రమే అని ఎప్పుడూ అనుకోడు: మొత్తం భారతదేశానికీ ప్రపంచ మానవజాతికీ తాను కవి ప్రతినిధి నని భావిస్తారు: ఆయన మాటల్లో చెప్పాలంటే 'నేనెప్పుడు గొంతెత్తినా నాకోసం కాదు. ఏడుకోట్లమందికోసమూ కాదు, యాభైకోట్లమందికోసం గొంతెత్తాను, నేను పడుతున్న బాధలే నాదేశమంతా పడుతోంది; నామానవజాతి అంతాపడుతోంది. కనుక నే నాజ్వాలిక నాదేశపు నాలిక ఇదే 'నాదేశం-నాప్రజలు.'

ప్రజలబాధల్ని తొలగించడానికి విప్లవాన్ని సృష్టించి తనసర్వస్వాన్నీ త్యాగం చెయ్యడానికి సిద్ధంగా వున్నానని చెపుతూ శేషేంద్ర యిలాఅంటారు: 'రండి, నాశబ్దజ్వాలల మీద మీహృదయాల్ని రొట్టెల్లా కాలుస్తా, మీరెటు నడవాలో చూపిస్తా - నేను, చెట్టును పిడుగు చీల్చినట్లు, సమాజాన్ని చీలుస్తా, లోకంలో గాలిఅంతా పీలుస్తా... నా కాగితాలన్నీ కాల్చేస్తా, నాపర్వతాలన్నీ పేల్చేస్తా; నాశరీరపు ఇల్లంతా రక్తంతో అలుకుతా, నాకిటికీలన్నిటిలో పొలికేకల దీపాలు వెలిగిస్తా, నా నరాలన్నిటినించీ కాంతి పిండి ఇచ్చేస్తా.'

ఇలాగ నఖశిఖపర్యంతమూ విప్లవజ్వాలలతో కుతకుత ఉడికిపోయే శేషేంద్ర దుర్భర దారిద్ర్యాన్ని ఆకలిని చూసినప్పుడు, చప్పగా చల్లారిపోయి కన్నీటి సముద్రంగా మారిపోతారు. తనకవితా గర్వాన్నంతటినీ మరచిపోతారు...' ఏ గుడిసెల్లో పగలు మనుషుల్లేరో, ఏ గుడిసెల్లో రాత్రి వెలుగుల్లేకో, ఆ గుడిసెల్లో నడచిపోతున్నా-ఎక్కడ తిండిలేని పసివాడు దూడను మేతకు తీసుకుపోతున్నాడో, ఎక్కడ పసితనంకూడా బతకడానికి పనిచెయ్యాలో, అక్కడ నా కాళ్ళు నిజంగా తెగిపోయాయి. నా

చేతులు నిజంగా రాలిపోయాయి. నా నాలిక పడిపోయింది. అక్కడ నేను మహాప్రవాహాన్ని కాను, అక్కడ నేను ఝుంఝామారుతాన్ని కాను.

– ఇవి తిలక్ ఆర్తగీతాన్ని జ్ఞప్తికి తెచ్చే పంక్తులు. తనకవిత ఆకలివైపు చూడలేక ఏడ్చిందట; అక్కడనుంచి స్వర్గంలోకైనా సరే రా నందిట; శాశ్వతంగా ఆ పేదల నేలకి అంకితమై పోయిందట. వారికి కుళ్ళినపండులాంటి జీవితాన్ని ప్రసాదించిన విషవృక్షంలాంటి దుర్మార్గ సమాజాన్ని నిర్మూలించడానికి, కంకణం కట్టుకుంది శేషేంద్ర కవిత.

శేషేంద్ర కవితాద్వైతం :-

ప్రేమ–విప్లవం, భావకవిత–అభ్యుదయ కవిత, ఆత్మచైతన్యం – ప్రజాచైతన్యం : ఇత్యాది ద్వంద్వాలకు అభేదాన్ని పాటించే అద్వైతి శేషేంద్ర. అందుకే 'శేషజ్యోత్స్న'–'మండేసూర్యుడు' అనే కావ్యాలు ఒకేసారి వ్రాయగలిగారు. అలాగే 1976 లో 'నీరైపారిపోయింది', 1977లో 'గొర్రిల్లా'అనే పరస్పరభిన్నములైన రెండు చిన్నకావ్యాలు ఆంగ్లానువాదాలతో సహా ప్రకటించారు. వీటిలో 'నీరైపారిపోయింది'లో కవి పూర్తిగా అంతర్ముఖుడై సౌందర్యోపాసన, ఆత్మవిచారం కావించాడు 'గొర్రిల్లా'లో సామాజికస్పృహ, విప్లవచైతన్యం పరవళ్లు త్రొక్కుతూవుంటుంది. ఇందులో కవి బహిర్ముఖుడు.

'నీరైపారిపోయింది'లో కవి అంతశ్చేతన అడుగడుగునా మనకు ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది. ఆత్మదీపాన్ని ఆర్పుకుంటే శరీరానికే నష్టం. నల్లరాతికింద నీరులాగ మనరహస్యం మనకు తెలియదు. శరీరం ఒకటే అయినా, అనుభవాలు మారుతూవుంటాయి. నదిఒకటే అయినా నీరు మారుతున్నట్టు. ముందుకు జరుగుతున్న కాలం వెనక్కిరాదు కాలిపోయిన సిగరెట్లు పొగలోంచి మళ్ళీ సిగరెట్లను చెయ్యలేం–ఇత్యాది భావాలు కోల్లలుగా వున్నాయి.

'ప్రతివానజల్లుకూ నా జీవిత లోయ రంగులు మారుస్తుంది. ఆదేనదిలో నేను రెండోసారి ఈదడంలేదు. పుట్టినప్పుడు పెట్టిన పేరుతోనే – మారుతున్న నన్ను లోకం ఇంకాపిలుస్తోంది – ప్రవాహంలో అదేనీరు ఎప్పుడూ ఉండదని తెలీదు.

సాయంకాలం సిగరెట్టు కాలుస్తోంది. మెలికలు తిరుగుతూ నక్షత్రాల్లోకి పోతున్న పొగచక్రాల్ని వెనక్కి పిలిచి మళ్ళీ వాటిని సిగరెట్టుగా చెయ్యాలని చూస్తోంది.

పగలు, రాత్రి, సూర్యుడు, పుష్పాలు, చెట్లు, ఆకులు మొదలైన బలమైన సాంప్రదాయిక ప్రతీకలద్వారా ఉపనిషద్రహస్యాల్ని, జీవితసత్యాన్ని చక్కగా ఆవిష్కరించారు శేషేంద్ర. మొదట శరీరంలో ఖైదీగా బాధపడుతున్న జీవుడు క్రమంగా ఆశరీరంతోనే సరిపెట్టుకొని మనిషికన్నా హృదయం గొప్పదని గ్రహించి తనశరీరంలో తానే నిద్రపోతాడు. చేతిలోని కమలాలు పారేసి, గుండె పట్టుకుంటాడు.

'గొర్రిల్లా' అనే రెండవకావ్యంలో కష్టజీవుల గుండెల్లో రాజుకుంటున్న విప్లవాగ్నిని గూర్చి హెచ్చరిక చేశారు శేషేంద్ర. శ్రమజీవులైన అమాయిక ప్రజల్ని దోపిడీ చేస్తూ బలవంతంగా త్రొక్కిపెడితే, వాళ్ళల్లోవుండే గొర్రిల్లా తత్త్వం ఒక్కసారిగా విజృంభిస్తుంది. దాన్నిఆపడం ఎవరికీ శక్యంకాదు. ఈ గొర్రిల్లాతత్త్వాన్ని రకరకాలుగా ప్రదర్శించాడు కవి. మాటల్ని తుపాకిగుండ్లుగా చేసి పేల్చాడు. ఈక్రింది ఉదాహరణాన్ని పరిశీలిస్తే శేషేంద్ర విప్లవచైతన్యం ఎంతతీవ్రమయిందో బోధపడుతుంది :

'......సముద్రం ఒకడికాళ్ళదగ్గరకూర్చొని మొరగదు; తుపానుగొంతు 'చిత్తం అనడం' ఎరగదు; పర్వతం ఎవడికీ వంగి సలాం చెయ్యదు. నేనింతా ఒకపిడికెడు మట్టేకావచ్చు–కాని కలమెత్తితే నాకు ఒకదేశపుజెండా కున్నంత పొగరుంది; కష్టాల్ని కన్నీటిలో ముంచుకొని బిస్కెట్లలా తింటాను. బ్రతుకంటే బలవంతుడైనవాడే శబ్దంనుంచి శతాబ్దం వరకూ మలిచే శిల్పి అని ఆవిష్కరిస్తాను.

నరికిపారేయ్ నాచేతులు తిరిగివచ్చి నాకే అతుక్కుంటాయ్–నాతుపానుల్లో ఆకాశం ఆకాశమే ఎగిరిపోయింది ఒక కాగితప్పీలికలా; ఇకనక్షత్రాలగుంపులకు విలు వేమిటి నా రస్తాలో !...... నేను తుపానులకోసం గాయాలకోసం తాగుబోతులకోసం వెతుక్కుంటూ పోయే వాడ్ని; ప్రజాశిఖరాలు మూస్తే కరిగి, ఒక పద్యాన్నయి కాగితంమీదికి కారిపోతా.

నాభాషలో భూకంపం పుట్టింది. శబ్దాలగుండెలు పగిలి ప్రవహిస్తున్న, ఆగ్నేయరక్తంలో మనుషుల నాల్కలు తేలుతున్నాయి. ఈ శబ్దాల చెత్తంతా చీపుర్లతో చిమ్మివేయండి. అప్పుడు ప్రత్యక్షమవుతుంది పేజీలమీదశుభ్రంగా నా తెల్లటిగొంతుక !'

శేషేంద్ర కావ్యచేతన;- ఆంధ్రదేశంలోని నేటి యువతరమంతా శేషేంద్రవెనకాల వుంది. ఇంతకుముందు రాజకీయ పక్షాలవారు యువకుల్ని తప్పుత్రోవలు పట్టించారు. ఇప్పుడు వారికి శేషేంద్ర సరియైన మార్గం చూపుతున్నారు. సామాజిక చైతన్యాన్ని గురించి శేషేంద్ర యిలా అంటారు: 'కవినుంచి సామాజిక చైతన్యం అడగడం సూర్యుడ్ని ఒక కొవ్వొత్తి కాంతి ఇమ్మని అడగడంతో సమానం. సామాజిక చైతన్యం కవికి కావలసిన చైతన్యంలో వెయ్యోవంతు కూడాకాదు... సామాజిక చైతన్యం కంటే సాహిత్య చైతన్యం గొప్పది కాని సాహిత్య చైతన్యం కంటె గొర్రిల్లా చైతన్యం గొప్పది. ఈ గొర్రిల్లా చైతన్యమే మనకు

ఈనాడు కావాలి. సాహిత్య చైతన్యం ద్రష్టృత్వము, గొరిల్లా చైతన్యం కర్మణ్యత. ఆంధ్రదేశంలో ఈసాహిత్య చైతన్యాన్ని పెంపొందించడం కోసమే శేషేంద్ర 'కవిసేన'ను స్థాపించారు.

గోపాలచక్రవర్తి వంటి విమర్శకులు శేషేంద్రను 'సాహిత్యగామా' అని ప్రశంసించారు. మరికొందరు విమర్శకులు 'గామా' అనే పదానికి వ్యుత్పత్తి చెపుతూ 'గా' అంటే 'గాంధీ' అని 'మా' అంటే 'మావో' అనీ చమత్కరించారు. శేషేంద్రకు ఒక చేతిలో గాంధీ చేతికర్ర, మరోచేతిలో మావో మరఫిరంగి ఉంటాయట. అంటే మానవతావాదమూ, విప్లవచైతన్యమూ రెండూ వున్నాయి శేషేంద్ర కావ్యచేతనలో.

**తెలుగువిమర్శకుల దృష్టిలో శేషేంద్ర:-**
శేషేంద్రలోని మహాకవిని మొదట గుర్తించినవారు వేంకటపార్వతీశ్వర కవులు, విశ్వనాథసత్యనారాయణగారు. కాని శేషేంద్రకు పండితుల ప్రశంసలు సంతృప్తినీయలేదు. తన పద్యం ఎంత హృద్యంగా ఉన్నా, ఎంత ప్రసన్నమైన ద్రాక్షాపాకంతో ప్రవహిస్తున్నా అది ప్రజలగుండెలకు సూటిగా తగలటంలేదని గుర్తించారు. ఒక ప్రక్క శ్రీశ్రీ పక్షంలోని కవిశూరులు వచనకవితల మెషిన్‌గన్స్ పుచ్చుకొని తీవ్రంగా అభ్యుదయ కవిత్వం అగ్నియుద్ధం చేస్తుంటే, తానుఇంకా విశ్వనాథ పక్షంలో ఛందోబద్ధ పద్యాల విల్లమ్ములు ధరించి గిరిజనుడులా పోరాడుతున్నట్టు ఫీలయ్యారు శేషేంద్ర. వెంటనే ప్రాచీన ఛందస్సుల అడ్డుగోడల్ని పగలగొట్టుకొని శేషజ్యోత్స్ననీ, మార్తాండతేజస్సునీ దశదిశలా వెదజల్లారు. దీర్ఘసమాసాల పాముకుబుసాల్ని విడిచి 'మండేసూర్యుణ్ణి' ఉంగరంలా ప్రజల వేళ్ళమీదికి ఎక్కించారు. అయినాసరే తెలుగువిమర్శకులు ఆయన్ని అంతగా పట్టించుకోలేదు. శేషేంద్ర నిరుత్సాహపడక తనకావ్యాలను హిందీ, ఉర్దూ, ఇంగ్లీషు భాషల్లోకి అనువదించారు. ఔత్తరాహులు దిగ్భ్రమచెంది శేషేంద్రను 'యుగకవి'గా కీర్తించారు. అప్పుడు తెలుగువాళ్ళు కళ్ళు తెరిచారు. ఇంతలో 'నాదేశం-నాప్రజలు' పెద్ద తుపానులా దేశమంతటా హోరెత్తింది. ఇక ఆయన్ని మనవాళ్ళు మహాకవిగా ఒప్పుకోక తప్పలేదు. 'శేషేంద్ర పారిపోయిన కవిత్వాన్ని చేరబిలిచిన రసవాది. శ్రీశ్రీ తిలక్‌ల స్థాయిని ఎన్నవలసిన కవి. ఆధునిక తెలుగు కవితా చరిత్రలో నూతన అధ్యాయం ఆవిష్కరించిన కవి' అన్నారు ఎమెస్కోవారు'

'రచయితకు ఆవేశం, ఆలోచన రెండూ కావాలి- కాని ఆవేశం తోసుకు ముందుకువస్తే అది నినాదాల్ని పలుకుతుందికాని కవిత్వంకాదు. ఆవేశం ఆలోచనలకు ప్రాణమిస్తే అది గొప్పకవిత అవుతుంది. మీ రచనలో అది చూచాను' అన్నారు పండితవిమర్శకులు ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రిగారు.

'తెలుగుకవితావనంలో వేళ్ళమీద లెక్కింప తగినంత సౌరభోపేతమైన imagish పూల చెట్లున్నాయి. అందులో మీకవిత సింహాచలం సంపెంగ చెట్టు...మీరు రాసిన కవిత్వం చదువుతున్నప్పుడు నాకు- ఒక పాబ్లోనెరూడానో, ఒక స్పెండర్‌నో చదువుతున్నప్పటి అనుభూతీ, సాదృశ్యం కలిగాయి' అన్నారు ప్రసిద్ధ అభ్యుదయ కవి సోమసుందర్.

**భారతీయచిత్రంలో శేషేంద్రస్థానం :**
హిందీభాషలోఉత్తమకవిత్వాన్ని వ్రాసి, జ్ఞానపీఠప్రశస్తిని పొందిన మహాకవి దిన్‌కర్ కన్నా, హిందీ విప్లవకవి ఆగ్నేయ కన్నా, మన శేషేంద్రశర్మ గొప్పకవితను అల్లుతున్నారని ఎందరో హిందీసాహిత్య విమర్శకులు, పండితులు అభిప్రాయపడుతున్నారు. బీహార్ రాష్ట్రంలోని ఛప్రాలోగల రాజేంద్ర కళాశాలలో పనిచేస్తున్న డా. కేదారనాధ్ లాభ్ శేషేంద్రను దినకర్‌తో పోల్చి యిలా అన్నారు : 'శేషేంద్ర కావ్యచేతనకు జన్మస్థానం ఆయన జన్మించిన యుగం, ఆయన సమాజం, ఆయన దేశం, ఆయనప్రజలు, విశాల భారతదేశపు 60 కోట్ల ప్రజలు; అందుచేతనే నేను ఆయన్ని తన యుగపు శ్రేష్ఠకవి, మహాకవి అంటాను...దిన్‌కర్ కవిత్వంతో పోలిస్తే, అందులో యుగీన కవితా సందర్భంలో, శేషేంద్రలో దిన్‌కర్‌లో కంటే కవిత్వం అధికంగాఉంది'.

జయపూర్‌లోని రాజస్థాన్ విశ్వవిద్యాలయం హిందీ విభాగాధ్యక్షుడు డా. విశ్వంభర్‌నాధ్ ఉపాధ్యాయ్ మన శేషేంద్రను ఒక యుగచేతన నిర్మాతగా కీర్తిస్తూ, వారి ఆగ్నేయకన్నా మన శేషేంద్రశర్మ నఖశిఖ పర్యంతమూకవి. భారత్, ఆఫ్రికా, చీనా, సోవియట్ రష్యా, గ్రీసు అట్లాగే యావత్ ఐరోపీయదేశాల సభ్యతల్నీ, సంస్కృతుల్నీ, కళల్నీ, మథించి, శేషేంద్ర వాటి ఉత్కృష్ట తత్త్వాలను ఆత్మీయం చేసుకున్నాడు. భిన్నభిన్న బౌద్ధిక సిద్ధాంతాలతో తన మేధను విద్యుదీకరించి, తనని ఒక ఆవేదనామయ ఉపాధిగా వికసింపజేసుకున్నాడు... శేషేంద్ర ఈ యుగపు వాద్యమూ, వాదకుడూ - రెండూను. ఆయన ఒక వట్టిఉపాధి మాత్రమేకాదు, ఒన యుగచేతనా నిర్మాత అయిన కవి కూడా...ఆగ్నేయ రచనల్ని శేషేంద్ర రచనల్ని పోల్చిచూస్తే శేషేంద్ర ఆగ్నేయకంటే గొప్పకవి, సార్థక కవి అని బుజువవుతుంది'.

ఇంకా డా. కైలాస్‌చంద్రభాటియా, ప్రొ॥ ధనం జయవర్మ, ప్రొ. ఆనందప్రకాశ్ దీక్షిత్. డా. ప్రమోద్‌వర్మ, డా. భగవత్‌శరణ్ ఉపాధ్యాయ మొదలగు ప్రముఖ హిందీ సాహిత్య విమర్శకులు శేషేంద్ర కవితను వేనోళ్ళ కొని

యాడారు. సయ్యద్ ముజిబుర్ రహమాన్, అక్తర్ హాసన్, డా. సులేమాన్ అథ్వర్ జావేద్ మొదలగు ఉర్దూ విమర్శకులు శేషేంద్ర కవితాశక్తికి జోహారు లర్పించారు. శ్రీమతి ఇందిరాదేవి ధన్ రాజ్ గిర్, శ్రీ శ్యామల్ బెనర్జీ, శ్రీవిద్యా నివాస్ మిశ్ర, శ్రీ అమరేంద్ర, శ్రీ ఆర్. యస్. సుదర్శనం, శ్రీ వి. పి. శర్మ మొదలైన ఆంగ్లవిమర్శకులు కూడా శేషేంద్ర కావ్యాలకు నివాళిపట్టారు :

"I am left with little doubt that in his own time he has originated a school of expression unknown to Telugu before. His writing is a flame which will awaken the sleeping spirit of the people".

(—Smt. Indira Devi Dhanrajgir)

"Symbols come to Seshendra as perfume to flower. And these symbols are rich in the history and the philosophy of Indira, nay, of the universal".

—Shyamlal Banerjee)

"I am all praise for the poetic genius of Seshendra Sarma. Every word that he usee is golden and every image that he brings in, is marvellous",

(—V. P. Sharma)

ఒకే ఒక కవి: ఆధునికాంధ్ర సాహిత్యంలో నిన్న మొన్నటి వరకూ ముగ్గురే నిజమైన కహాకవులు : పండితకవి విశ్వనాథ, ప్రతిభాకవి కృష్ణశాస్త్రి, ప్రజాకవి శ్రీశ్రీ. ఈనాడు తెలుగుసాహిత్య

## సుఖసేవధి

- శ్రీ చల్లా నరసింహారావు.

ఇంటి యాడుదెపుడు నెచటికేఁగఁగరాదు!
తాను వేశ్యలిండ్లఁ దారసిలును!!
మగల కున్న వాంఛ మగువల కుండదే?;
యన్ని మనసులందు నతనుఁ డుండు.

పరసతి సొంపుసూచి యెద
వాల్చని మానవు లేరు లేరు; ధీ
వరులెవరైన నుందు రను
వాక్కులు వట్టివి; పండె మొద్దుదున్;
మఱిమఱి యేకపత్నిగల
మాన్యులు మేమని డంబు సూపినన్
ధః పయి వేశ్యలేల వెత
తమ్ముగ నుండిరి, నాఁడు నేఁడునున్ ?

ధనము గడించుకొమ్మెటులొ;
దానినిఁ బ్రేయసి మోజుదీఱ లె
క్కనుగొనకుండఁ జిమ్ము; నిజ
కష్టమయప్పుడె సిద్ధిపొందు; మ
ర్త్యనకదె సౌఖ్యశృంగమని
యూఁది వచించెద నొట్టుపెట్టి; మా
నినిహృదయార్చనా ముదము
నీకు లభించునె గుళ్ళుచుట్టినన్

సురలోకంబున శిల్పులే కొలుపఁగా
సొంపారు వేశ్మంబునన్
స్థిరవాసంబుగ స్వామి యుండ మఱి యీ
దేవాలయమ్ముల్ భువిన్
నరభక్తుల్ నిలుపంగ నేల?; యొకఁడే
నాఁడైన నిన్నింటఁ గా
పురమున్ సేయఁగలండె?శూన్యమగు రూ
పున్ గుళ్ళుపొందెన్ గదా!

బిలబిల విచ్చిపూచుచు న
వీన సువాసన వంపియూఁగు సొం
పొలసెడి కాడమల్లి తరు
లున్నవి; పూవులు నీడలోను శీ
తలసుర పుచ్చుకొందును; సు
తారముగా సరకమ్ము నిమ్ము; క్రొ
వ్వలపుల తావిబొమ్మ! వల
వంతను బొమ్మని యాజ్ఞసేసెదన్

వాసన బర్వుతో విరిసి
వంగిన గన్నెరు పూలుకోసి కీ
ర్ణాసిత గండశైల పద
మందునఁ బోయ ఫలమ్ము రాదు; త
ద్వాసిత పుష్పమందొలసి
వచ్చు ఫలమ్మును మాత్రమారకే
పోసెడి చాయ గాంత్రు మఱి
పాపము పుణ్యము యేది మీకగున్ ?

'యోగుల మేము స్వర్గమున
నుండియె దేవుఁడు పంపెనమ్మ; నీ
రోగము రొచ్చు మామహిమ
రూపముఁజూపి హరింతు'మంచిటన్
భోగములందు బాబులకుఁ
బోవు వయస్సు కతమ్ముచే నెదో
రోగము వచ్చిపడ్డఁ జెగ రోఁజుచు
వెజ్జుల వేడుటా? బలే!

(బృహస్పతి ప్రణీతమని చెప్పఁబడు 'చార్వాకదర్శనము' ననుసరించిన నా తెలుగు కావ్యమునుండి)

---

లోకంలో ఒకే ఒక మహాకవి : అతడే పండితకవి, అతడే ప్రతిభాకవి, అతడే ప్రజాకవి— శ్రీ గుంటూరు శేషేంద్ర శర్మ !!

'నడిస్తే నా అడుగులు మబ్బుల్లో పరు
గెత్తే పిడుగులు
ఎత్తితే నాచేయి మండే అగ్నిజ్వాల...'
'బాధల్లో మునుగుతాను, సంతోషాలలో
ఉదయిస్తాను
నేను మానవసూర్యుణ్ణి...'
'నాగొంతు నా ప్రజలకు దానంచేశాను
నాజాతే నాభాషకు ప్రాణవాయువు
నాదేశం నాశిల్పానికి ఆయువు
నేను రక్తప్రవక్తను !,

—అని ఎలుగెత్తి చాటిన శేషేంద్రను "యుగకవి" అనడంలో సందేహమేముంది?

[బెంగుళూరు విశ్వవిద్యాలయం, ఆంధ్ర శాఖవారు 29-1-1977న నిర్వహించిన యుగకవి శేషేంద్ర సాహిత్య చర్చాగోష్ఠిలో చదివినవ్యాసం] *

# ప్రకృతి లీల - "ఋతు హేల"

- శ్రీ డా. జి. బి. ఎన్. ఆచార్య, ఎం. ఏ., పిహెచ్. డి.

(గత సంచిక తరువాయి)

వచ్చె గ్రీష్మమ్ము ఋతురాట్టు వచ్చి జనుల
కనుపమోత్కర్ష లంది తానరిగియుంట
గర్వజాలక, జ్ఞాతి మహోగ్ర వైర
మెంచి క్రోధాగ్నులను ప్రపంచించె ననగ!

అని చమత్కారముగా గ్రీష్మఋతువును ఆవిష్కరించినారు. మహోష్ణమును, భీష్మము అయిన గ్రీష్మము పెట్టు బాధలను వర్ణించుచు 'ఉద్విగ్న సర్వ జీవగణమయ్యె ధాత్రి విశిష్టవృత్తి!' అని అల్పాక్షరములలో అనల్పార్థమును నిక్షిప్త మొనరించినారు. వసంతఋతువు నవ నవోత్సాహమును, చిత్త చాంచల్యమును సృష్టించునది కాగా గ్రీష్మఋతువు కొంత మానసిక వ్యథను కలిగించునటువంటిది. గ్రీష్మతాపమునకు తట్టుకొనలేక శైత్యోపచారముల నిమిత్తము మనుష్యులు కొన్ని మార్పులను తెచ్చుకొనుట సహజము. జీవన విధానములో ఇటువంటిమార్పులను గురించి కవిగారు చిత్రముగా అభివ్యక్తముచేసినారు.

కుండలోపలినీటి కొఱకు వేడిరి రజ
  తాది పాత్రల జల మ్మానలేక
పూరిపాక వసింపగోరిరి సౌధాంత
  రముల వేడిమికి తాళగను లేక
సన్నని చిన్నివస్త్రమ్ము లెంచిరి ముదు
  కలు గూర్చు చిత్తడి నిలువలేక
తాటిముంజలకు నారాటమందిరి ఘన
  మగు వంటకములపై నాస్థలేక
ఏమి కోటికి పడగల నెత్తినట్టి
భాగ్యవంతులు వేసవివాసరముల
కోరి దారిద్ర్యమున కనుకూలురైరి
ఇనుడు తలచిన చేయని దేమి కలదు?'

పై వర్ణనలో ధనికుల జీవన విధానమును గ్రీష్మమువచ్చి బీదలజీవనవిధానము లోనికిమార్చినట్లు కవిగారు విచిత్రరీతిలో వ్యక్త మొనరించినారు. ఇందు ఒక జీవన రహస్యము కలదు. మానవునకు కొన్ని యిబ్బందులు ఎదురైనపుడు వాని నుండి బయటపడుటకు ఎటువంటి క్రిందిస్థాయికి దిగుటకైనను సిద్ధపడగలడు. అంతేకాక ఉచ్చనీచములతో నిమిత్తములేక ప్రతి జీవియు కాలప్రభావమునకు లోబడి యుండవలసినదే. ఈ జీవన సత్యములను బోధించుటకు కవిగారు చేసిన ప్రయత్నమే చమత్కార చారుత్వము కలిగిన పైపద్యము. కవియేదో ఒక మూసలో కావ్యమును వ్రాసుకు పోవడము గాక, ఒక ప్రయోజనమును, ప్రబోధమును, దృష్టిలో పెట్టుకొని అందుకు అనువైన సన్నివేశములను, వర్ణనములను తీర్చిదిద్దుట ఎంతేని యావశ్యక మని నా యభిప్రాయము. ఈ నాయభిప్రాయమును ఈ కావ్యము బలపరచు చున్న దని నిస్సందేహముగా చెప్పవచ్చును.

స్వీయభాగ్యప్రభావ విశిష్టగుణము
లందుకొన భోగులు దరిద్రు లాతపమున
నలసిసొలసిరి సృష్టిరహస్యములగు
వెలుగు-చీకటులను విధి తెలిపినట్లు !

అని చక్కని ఉపమానముతో మానవ స్వభావమును చిత్రించినారు.

'వట్టిపోయిన నూతివద్ద నీరూరగా
  కలిసి కావించిరి కప్పపెండ్లి
రాత్రికాలమున విరాటపర్వపుకథ
  విని నింగిజూచిరి వేడ్కమీఱ
జలరాశియౌనో నిర్జలరాశియే యౌనో
  తెలియగా గ్రహవేత్త గలిసికొనిరి
వరుణదేవుని గొల్వనరిగిరి దేవాల
  యములకు భక్తి భావములు మెఱయ
అగ్ని విరజిమ్ము గ్రీష్ముని యంతరంగ
మార్ద్ర మొనరించి త్రాగుటకైన నీరు
పడయగా యత్నములుసల్పి బహువిధాల
పల్లెజను లెల్ల మిగులసంభ్రమము గొనిరి!'

అని గ్రీష్మఋతునిష్క్రమణమును వివరించినారు. పై పద్యములో సత్సంప్రదాయములు పొదగబడినవి. తెలుగుదనము వెల్లువయై ప్రవహించినది. ఎక్కువగా ప్రజల ఆదరాభిమానములకు నోచుకొనిన విషయములనే ప్రస్తావించుట కవిగారి లోకజ్ఞతకు నిదర్శనము. అతి సన్నిహితములైన విషయములను చెప్పి మెప్పించుటయే కవితాశక్తికి, కవి యుక్తికి నిదర్శనము కాగలదు. ఈ కావ్యములో అన్ని చోటుల పై జెప్పబడిన శక్తియుక్తులు పూవుతావులవలె సరసులను సమ్మోహన పరచుచున్న వని చెప్పవచ్చును.

'ఒక నల్లమేఘమ్ము నొరయుచు తెలిమబ్బు
  పందెమ్ము గెలువగాఁ బర్వులెత్తె
అంతంత దూరాన నాగిన నేస్తమ్ము
  గలియ వేఱొక్కటి నిలువ కేగె
ఈ రెండు మేఘమ్ము లెంత మిత్రమ్ములో
  సన్నగర్జల రహస్యములు పలికె
ఆజన్మవైరమ ట్లాగక తీవ్రగ
  ర్జాభాషణములివ్విసలిపె నిచట
నేల మానవులట్లుగా నింగి నివియు
సుగుణదుర్గుణములు నేర్చెచోద్యమొప్ప
పట్టుదల మైత్రి అంతర్య భాషణములు
వైరభావమ్ము నెఱపు తీవ్రతలు మెఱయ!'

అని వర్షఋతుధర్మమును వర్ణించినారు. ఈవర్ణనలో మనుష్యులకు దూరమైన ఒక ఆకాశపు దృశ్యము అందముగా చిత్రింపబడినది. ప్రకృతి వర్ణనతోపాటు సందేశాత్మకముకూడ అయినచో అది ఉత్తమ కవితయే కాదు ప్రయోజనాత్మకమైన కవితకూడ కాగలదు. ఈ కావ్యములో రసానుభూతి, సందేశాభివ్యక్తి రెండును కల వని పైపద్యము నిరూపించుచున్నది. కనుక ఈ కావ్యము ఉత్తమ కావ్యము. ప్రయోజనాత్మక కావ్యము.

లోకములో సుఖదుఃఖములు సమానముగా నుండుట సహజము. ప్రకృతి గతములైన మార్పులు కొందరి కానందమును కలిగింపగా మరికొందరికి దుఃఖమును కలిగించును, అందుకే కవిగారు—

'వేసవి దగ గొన్న విశ్వంభరాదేవి
ఆర్చిన ట్లయ్యెగ ర్జారవమ్ము
వర్ష దేవత చేరవచ్చి స్వాగతగీతి
పాడె భేకము లొక్కపగిదిఁ గూడి
నేల నిండిన నీట నిలువజాలక కీచు
రాళ్లాడి పోసె వర్షాశ్రమములను
జడివానమహిమ మెచ్చని వృద్ధదంపతుల్
వయసుకాలపు కథల్ వల్లెవేసి
రాకసము చిల్లిపడువానరాక జూచి
గుడిసె కప్పని నిఱుపేద గుండె పగిలె
చేనుదున్నిన హాలికమానసమ్ము
సంతసపుపంట లప్పుడే సంతరించె!'

అని వర్ణించినారు. ప్రచండవర్ష ధారలకు సకలపక్షిగణము కులాయములు వీడిఘోర రవములను సల్పిన వట. నిరాశ్రయమైన తన సంతతిని గని యశ్రుధారలతో వన దేవతయే బిట్టు విలపించినట్లుగా పక్షులరవము లున్నవని యుత్ప్రేక్షించినారు. ఇంకను అధికమైన వర్షమునకు పశువులను రక్షించుకొనలేక పేదరైతులు పడుకష్టములను కరుణ రసాత్మకముగా వర్ణించి, పాఠకుల గుండెలను ఆర్ద్రమొనరించినారు.

'వాన వచ్చుటె తడవుగా వనిపాలాల
కర్షకులు రేయి పవలను గణన లేక
అదను వెంబడి కష్టించి యఖిలజనుల
హాయి మనజేసి, కొని రాతిధేయకీర్తి!'

అని కర్షకుల కృషిని ప్రశంసించి, వారి లోకోపకార పరాయణత్వమును చాటినారు. రైతు అన్నదాత. అతని రెక్కల కష్టములోనే దేశసౌభాగ్య మిమిడి యున్నది. అహోరాత్రములు కష్టించి, భూమాతనే నమ్ముకొని, విలువైన సస్యములను పండించి, తన కుటుంబమునకే కాక, తోడికుటుంబములకు కూడ ఆహారమును పంచిపెట్టి 'ప్రాణదాత' అని కీర్తింపబడుచున్నాడు. అట్టి రైతు సర్వథా స్తవనీయుడు. కవిగారు రైతుకు సముచితస్థానము నొసంగి, యాతని దీక్షను, కృషిని ప్రశంసించుట సమంజసముగా నున్నది.

'ఉపనిషత్తుల భావ మొలకబోసినయట్లు
వేసవి తనయంత మాసిపోయె
ధర్మశాస్త్రముల యర్థమ్ము విప్పినయట్లు
పుడమి నెల్లెడ వాన గడలుకొనియె
శ్రుతిధర్మ మెఱిగించుచొప్పున నొకచోట
కురియువర్ష మొకంట కురియమానె
సాహితీసంపద సంతరించు విధాన
ఆనంద మొనగూర్చె వానిగాలి
సకలహిందూమతోన్నత సరణి దెలుప
నవతరించిన యాచార్యు డనగ బుడమి
డిగ్గె ప్రావృట్టు జీవికడింది మహిమ
నవనవమ్ముగ నిల్ప ననన్యరీతి!'

పైపద్యములో ఉపనిషత్తులు, ధర్మశాస్త్రములు, శ్రుతులు మున్నగునవి ప్రస్తావింపబడుటచేత కవిగారి ఉదాత్త హృదయము, ఉన్నతాశయము వెల్లడింపబడినవి. సంప్రదాయకవిగా కావ్యమున కెంతయో న్యాయమును చేకూర్చినారు. సంప్రదాయ సౌగంధిక సౌరభముచే సాహిత్యప్రియులను సమ్మోహితులను జేసి, ఉత్తమ కవితా లోకములకు గొంపోయినారు. కవిగారి సంస్కార సౌలభ్యము కావ్యమున కెంతయో వన్నె చేకూర్చినది.

'రాజిల్లె దినములు తేజః ప్రపూర్ణత
ఘనయోగిచంద్రుహృత్తమ్ముల మట్లు
దిశలెల్ల హృద్యసందీప్తి సత్కర్మల
అనుపమకాంతులై యతిశయిల్లె
స్రోతస్వినులు రమ్యశోభామనోజ్ఞతల్
తాల్చె పతివ్రత తలపు లట్లు
సరసులు పద్మవిస్తారమ్ములై క్రాలె
యతి మనః పద్మదీధితులు వోలె
కడచనిన వర్షజనుల చీకాకుపఱచి
కష్టములు కల్గజేయుటల్ కాంచలేక
అవతరించిన నిర్జరప్రవరు డనగ
వచ్చెను శరత్తు వర్షసంవర్ధనముగ!'

అని శరదాగమనమును మహదానందముతో వర్ణించినారు. శరత్కాలశోభను వర్ణించుటకు గ్రహించిన యుపమల ఔచిత్యము సువిదితము. శరత్తును నిర్జర ప్రవరునిగా సంభావించిన కవిగారి హృదయౌన్నత్యమును ప్రశంసింపవలసి యున్నది. ఇంకను పుంతదారులు బురద పోయి గట్టిపడుట, ఆ దారులలో బండ్లు తేలిక గాచరింపగలుగుట మున్నగు సుగుణములను ప్రస్తావించుచు, కామినీకాముకుల మనస్సీమలవలె రమ్యగమ్యములై శరద్రాత్రులు అతిశయించిన వని నిసర్గమనోజ్ఞముగా వర్ణించినారు. శరదృతువు కౌముదీ సంపదకు కాణాచి. అందుకే శరచ్చంద్రిక కవులకు కమనీయమైన కవితా వస్తువు కాగలినది.

'మల్లెలు కొల్లలుకొల్లలుగా తెచ్చి
పుడమి నేర్పుగ నాఱబోసినట్లు
హిమనగకాంతిపుంజములు తామై వచ్చి
పృథివి నెల్లెడల వ్యాపించినట్లు
ఘనయోగసిద్ధి నందిన చిత్స్వరూపుని
జ్ఞానరోచులుభువి సాగినట్లు
ధర్మమ్ము శాంతిసత్యములదీధితు లెల్ల
పయనించి నేలపై ప్రాకినట్లు
కప్పురపుధూళి పుడమిపై గప్పినట్లు
తెల్లమబ్బులు ధరణిపై తిరిగినట్లు
స్వచ్ఛమై హృద్యమై శరత్సమయవేళ
వెన్నెల యపూర్వశోభల విస్తరిల్లె!'

అని శరచ్చంద్రికా సౌభాగ్యమును తనివిదీర వర్ణించినారు. 'కప్పురపుధూళి పుడమిపై కప్పినట్లు' అనునది మంచి చిత్రణ. 'మబ్బులు ధరణిపై తిరిగినట్లు' అనునది అద్భుతమైన అభివ్యక్తి. ఆకాశమునందు సంచరించు మబ్బులను కవిగారు భూమిపై సంచరింపజేసినారు. ఇదియే

# గ్రంథ సమాలోచన

## ఆర్యాశతకము (చిత్రపది)

[కర్త: శ్రీ కపిలవాయి లింగమూర్తి గారు M. O. L. వెల 150 పైసలు. ప్రాప్తిస్థానము శ్రీ కె. గోపాలకృష్ణ గారు. న్యూస్ ఏజంటు. బస్ స్టాండ్. నాగర కర్నూలు. ఆం. ప్ర.]

కావ్యసంతానములో చిత్ర కావ్యములు కడపటివి. శ్లేషయమక చక్రవర్తులు కొందరు సంస్కృతమున వానికిఁ బ్రాచుర్యము నాపాదించి, వాని నాపాత రమణీయములుగ నొనర్చిరి. భట్టుమూర్తి వంటివారు వానిని మరింతసాగదీసి, సంస్కృతాంధ్రముల నెగడిరి. "కేదారపోషణరతా;?" వంటి విట్టివానికి మూలప్రాయము లని చెప్పవచ్చును. పదములకు వ్యత్యయమును, విచ్ఛేదమును కలిగించుటవలని విశేషములను గ్రహించుటకును, భాషాపండితుల వినోదమునకును, వీని యునికి ప్రయోజనకరమై భాషాపరిచయాదుల కుపయుక్తమగును. ఇట్టి విన్యాసములను మనవారు కావ్యచిత్కృముగ నుపయోగించి వీనికి రమణీయత గల్పించిరి. కథాదులువిడిచి కేవల మిట్టి శాబ్దిక విన్యాసముల నిర్వహించు పద్యరూపమగు చిత్రపదులలో నార్యాశతక మొకటి. ఆర్యాశతకమనగా మూక మహాకవి యార్యాశతక మన్పించును. కాని యిందు ఆర్యాయను మకుటము మాత్రమే యగపడును. ఆర్యశతక మనుచో బాగుండెడిది యనిపించును.

దీనిని రచించినవారు శ్రీ కపిలవాయి లింగమూర్తి గారు. వీరు M.O L. పట్టభద్రులు. ఇందలిపద్యములు, వాని నడక, శ్రీ లింగమూర్తి గారికి గల సంస్కృతాంధ్రభాషా సవ్యసాచిత్వమును వెల్లడించును. వీరికిగల భాషావైభవము సువిశాలము వీరి విచారధార సునిశితధారా సుదర్శనము ఇట్టి రచనలు తెనుగులో నరుదని చెప్పవచ్చును. 'రాజును సాధించుటకుఁ' వే! జగమున సూరికైన వేంకటరమణా; ఓజన్ విశ్వామిత్రము, వేజేతల నెంత సలుపు వినుమా యార్యా (30వప) 'వెలయాల్యాకుల'కను బాహ్లికము ననుసంధి లేమియుండుట కతనన్, వెల యెంతబోసినను యావెలది సంధి కుదర బోదు వినుమాయార్యా" (56ప) (ఛందోభంగము) వంటివి వారి వైయాకరణశీలతను సూచించును. కాంతకును వార కాంతకును సంతతమును గలదు వార, (55ప) వంటివి వారి సంస్కృతాంధ్రపద పాండిత్యమును సూచించును. ఇట్టి పద్యము లిందనేకములు.

గాయిత్రి నిష్టవంటి ముద్రారాక్షసము లిందు గలవు. 8వ పద్యము_ 'వికటకవికి కడియెడములు, నొకటిగనే దోచుసుమ్మి యొప్పదతడు పో, బ్రకటపుకవి సమయమ్ములు వికవికనగు శివుడురాని వినుమా యార్యా!' దురవగాహము. దానిటీక అసమగ్రము. 10 లో 'హరిహరుల రూప మొకటే ధరలో ప్రత్యయమునందె దనరును భేదంబు' రూపమను చోట 'మూల' మనిన బాగుండెడిది. రూపమనగా ప్రాతిపదిక కాదుకదా! ప్రత్యయసహితమగును కదా! 70 పద్యములో, సంసార నిర్వచనములో_టీకలో _ అందము=సమ్ అని వివరించుట విచారణీయము. ఇంకను వివరణ యవసరము. ఇందే మూడవపాదమున 'అందువలన సంసారమే' ఛందోదోషము 'మే' హ్రస్వము చేసిన సరిపోవును. 99వ పద్యము_ 'ఆకొనినపుడాహారము' లోకమ్మున హార మగును ఋషియైన సుమీ ఆకలిలోభం బట్టిది. ఆ కాశిక డెరుగుదాని నను మాయార్యా' 'టీకలో _ హారం అంటే దోచుకోదగినదని నారు. కాని సద్యస్స్ఫూర్తి కరమా? అని సందేహం.

నూరు పద్యముల తరువాత పన్నెండు పద్యము లిదేమకుటంతో వేరే సంఖ్యా విన్యాసంతో నున్నాయి. కారణం దురూహం. ఇట్టి రచనలు భాషాజిజ్ఞాసువుల హృదయాలకు చక్కగా సహకరించును. భాషాజ్ఞానం మరింతగా పెంపొందడానికి సహాయపడు ననుటలో సందేహము లేదు.

శ్రీ లింగమూర్తిగారు త్రొక్కిన త్రోవ నవీనమైనది. పాఠకుల యభివృద్ధి వికాసములకు మార్గదర్శి. ఇందు వీరికి గల యుభయ భాషానిశిత పరిచయ పరిశీలనలు సుస్పష్టము లగును వీరు కవిగా రాణించుటకు మించిన భాషాసంపత్తి వీరికి గలదు. వీరు కావ్య రచనాసంపత్తిచే పాఠకులకు సదానందము కల్గించగలరు. వీరట్టికావ్యములను రచించి పాఠకుల నానందింప జేయగలరని భావింపఁదగును.

'సుప్రసన్న'

—0—

( 18 వ పేజీ తరువాయి )

కావ్యజగత్తుయొక్క మహిమ. అందువలననే వాస్తవ జగత్తును అధిగమించి కావ్యజగత్తు మహోత్సాహమును కలిగించును. వాస్తవజగత్తులో జరుగునవేగాక, జరగనివికూడ కావ్యజగత్తులో జరుగుట కావ్యజగత్తుయొక్క ప్రత్యేకత. ఈ ప్రత్యేకతవలన కావ్యజగత్తు సర్వదా ప్రశంసనీయ మగుచున్నది. వాస్తవలోకములో జీవించుమనిషి, కావ్యలోకములో భావించి మనీషియై మన్ననలను పొందుచున్నాడు. ఆమనీషినే మనము కవి యనుచున్నాము.

(సశేషం)

# గంగావతరణము

– కావూరి పూర్ణచంద్రరావు,
ఎం.ఏ., బి.ఓ.యల్.

మాదిరి రాజ్యం బిడి
హమీశుం డరుగ నవ్యభూపతి యేలెన్
మాధుర్యత జనతా
మిత ఫలదాన కల్పకంబగురీతిన్

బ్బరించిన పెద్ద బెబ్బులి వక్త్రగ
 హ్వారములో కత్తులు పాతినాడు
ర్జించి పైదూకు గండుసింగముగుండె
 రెండుగా చీల్చి హరించినాడు
ండముల్వట్టి వేదండతండంబు గీ
 పెట్ట నెత్తుచు నేలఁగొట్టినాడు
రుచుక పైవచ్చు శరభాది మృగముల
 శరలాఘవముచేత చంపినాడు
తఁడు సామాన్యుఁడే? మృగయావిహార
మతు సమవర్తి! అపహృతసజ్జనార్తి
ర్వసద్గుణ సన్మూర్తి! సకలదిఙ్న
వయనటత్కీర్తి! శంతనుచక్రవర్తి!

దితపరాక్రముండు పృథి
 వీపతి శంతను డొక్కనాడు నె
మ్మది మృగయావినోద మహి
 మప్రసితోదయుఁ డేకతంబ కొం
 దనుక వేటలాడి బహు
 దాహపరీతత గాంగభూము ల
భ్యుదయ–పరిశ్రమాపనయ–
 పూతములంచు తలంపుగల్గినన్ ।
వని గంగా సైకతముల
నివిష్టత నుండ గాంగ వీచ్యుచ్చల కం
ణనికురుంబము మకరాం
కని సందేశం బొకండు కొనివచ్చె ననన్.

అక్షిగోచరమయ్యె మీనాక్షియొక తె
మెఱపుతీగను బోలినమేని కాంతి
తోడ–తరళత్రివళి రేఖతోడ–సొగసు
చిక్కదనమీను నునుజిల్గు చీరతోడ!
మనసు రెండింద్రియములందె మసలుచుండ
ఆమె నీక్షించెనతఁడు నేత్రాంచలముల
వీనుదోయి నదేదో! విన్పించుచుండె
 స్ఫుటముగానిస్వరము ప్రతీపునిదో?ఏ మొ!

'పుత్రు డుద్భవించిపున్నామ నరకంబు
తొలఁచి పుణ్యలోకములు ఘటించు
వంశదీపకుండు ప్రతిభాయుతుండు నౌ
పుత్రు నొకని నీవు పొందవలయు.

గంగాతీర పవిత్రభూముల మనో
 జ్ఞ శ్రీ శుభాళించు సా
రంగాంకాస్య నొకర్తు గాంచితి–భవ
 ద్రాజ్ఞీ పదం బామె కీ
వంగీకార మొనర్చినాను పితృవా
 క్యం బింతమన్నించి త
ద్గంగాస్వచ్ఛ సుశీల గైకొను మనం
 తాకాంతవం దోడుగా ।

వనగమనంబువేళ పితృ
 పాదులు పల్కిన పల్కులెల్ల నె
మ్మనమున లీలగా వినిన
 మాదిరి దోప తదీయబోధలం
దున వచియింపగాఁబడిన
 తోయరుహాక్షి యిదేయటంచు త
న్మనమున నిశ్చయించి మరు
 మార్గణముల్ హృదయం బదల్పగన్.

దాని శరీరసౌరభము
 దాని శుచిస్మిత సుందరత్వ మ
ద్దాని ముఖాంబుజ ప్రభలు
 దాని విలాసము నేత్రపర్వమై
వానికి దోప వాని విభ
 వంబును వాని ముఖంబు తీరుల
వ్వాని పరాక్రమాతిశయ
 భావము దానికి నచ్చెనచ్చటన్.

ఎదిగిన చూడ్కులం గనియె
 నింతిని శంతను డంత నామెయున్
పొదివిన చూడ్కులంగనియె
 భామతి! మారుడు వారి చూపులే
పొదలిన తూపులై తనర
 భూవరు నాయమ నేసె–వారల
భ్యుదయముగోరి చేరువయి
 పోవగ శంతను డిట్లు పల్కెడున్.

ఎందులదానవు ! నీవో
సుందరి! నిర్జనవనంబు చొఱ కత మది యె
మందువు ? నీ వొంటరిగా
నిందుండ భయంబులేదె?యిందుని భాస్వ

ఎన్నడో తాను మున్నతని
 నెక్కడనో కనినట్లులైన న
య్యన్నుల మిన్న మున్ను చతు
 రానన దివ్యసభాంగణంబునన్
తన్ను వరించు సోయగము
 దాపునకై చను దెంచునట్లుగా
ప్రన్నని యూహగల్గి శఫ
 ర ప్రవరాత్ముల నవ్వి యిట్లనెన్.

నాయెడ ప్రేమభావము క
 నంబడె నీకది యోగ్యమైన న
త్యాయత కీర్తివైభవ సు
 ధాకర! నాదు నభీష్ట మెట్టు ల
ట్లైయెడ సాగగావలె! న
 దిష్టమయేని వరింతు నిన్ను నా
పోయినపోకకే యెదురు
 పుట్టిన నివ్విధవాడి పోయెదన్.

అని వచియించె నప్పుడత
 డందుల కూఁకొని సర్వమీవు చె
ప్పినయదె శాస్త్రమై తనరు
 వేదసమానము నీదు వాక్కు నన్
మనమున నమ్ము మంచు ప్రతి
 నన్ బొనరించిన–లోకబాంధవుం
డునపరభామినీ మధుమ
 నోఽంతరవీథుల కేగ రక్తిమై.

ముకుళించెడు పద్మములో
నికి చనెమధుపద్వయంబు! నేపథ్యములో
నకలంక–కలధ్వని–రక
రకములు గాతోచె–రమ్యరమ్యంబగుచున్.

నా పేరు శంతనుం డన
నా పేరును గంగ యనియె నవనవఫణితుల్
నాపుణ్యఫలంబీ వన
నాపుణ్యంబీవె యంచు ననసె గుసగుసల్.

రాగము పొంతవోని యొక
 రాజును లాచిన చూపుతోడ నే
లాగితివోసి ! ఆదిసర
 శద్వితయాంతర పూర్ణబిందు ! స్వ
రోభగముచూపి నావు కదె!
 పూతచరిత్ర యటన్న ! నవ్వులున్
సోగలు కన్నులున్ వలపు
 చూపులు కాన్కలువెట్టె జేనికిన్

— 'భీష్మకావ్యమునుండి'.

# ఈ పక్షంలో

## త్యాగరాజ గానసభలు - శ్రీ బాలసుబ్రహ్మణ్యశర్మ కనకాభిషేకము

30-1-79 నుండి 6-2-79 వరకు త్యాగరాజ నారాయణదాస సేవాసమితి వార్షికోత్సవ గానసభలు రాజమండ్రి హిందూసమాజావరణములో జయప్రదముగా జరిగినవి.

అనేక సంగీత పండిత ప్రకాండులు కార్యక్రమాల్లో పాల్గొన్నారు. 4-2-79 తేదీని రాజమండ్రి గాయక శిరోమణి ఎం.ఎస్. బాలసుబ్రహ్మణ్యశర్మగారికి కనకాభిషేకం జరిగినది. ఏ తన్మహోత్సవ సభకు మద్రాసు ప్రభుత్వ ఆస్థానవిద్వాంసులు, గాయక సమ్రాట్ శ్రీ మంగళంపల్లి బాలమురళీకృష్ణ అధ్యక్షత వహించిరి. కవిశేఖరులు శ్రీ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారు సభాప్రారంభము గావించిరి. అధ్యక్షులు శ్రీ శర్మగారి సంగీత కళా వైదుష్యాన్ని సంప్రదాయబద్ధతనూ ప్రశంసించిరి. అనేక శిష్యులకు పాఠములు చెప్పి గాన కళను పెంపొందించుటను మెచ్చుకొనిరి. శ్రీ శర్మగారు ఇంట గెలిచి రచ్చ గెలుచుచున్నారనీ తాము రచ్చ గెలిచి యింట గౌరవ మందుచున్నామనీ వర్ణించిరి. శర్మగారు స్వస్థానంలో ముందు గౌరవం అందుచూ రాష్ట్రాంతరవిఖ్యాతి నార్జిస్తున్నారనీ తాము విదేశవిఖ్యాతులైన తర్వాత స్వస్థానగౌరవం పొందుచున్నామనీ చెప్పినట్లు సభ్యులభిప్రాయ పడుచున్నంతలో తాము చెప్పినది సంగీతమును గురించికాదు అనుట వారుచెప్పినది యద్విషయమా యని సదస్యులను సంశయ గ్రస్తులను జేసినది.

శర్మగారి శిష్యులూ,అభిమానులూ అనేకులు శర్మగారి నభినందించిరి. స్వర్ణ కుసుమాదులు సమర్పించిరి. సమితి తరఫున శ్రీ శర్మగారికి 'సంగీతస్వరసాగర' బిరుద మొసంగబడినది.

సభాప్రారంభకులు శ్రీ శర్మమురళీకృష్ణుల సమాగమము జీవాత్మ పరమాత్మైక్యమును దలపించుచున్నదని ప్రశంసించిరి. సంగీతమును ఆలోచనామృతముగా మలచుట యవసరమనీ అందుకు పై ఉభయులూ సమర్థులనీ వివరించిరి. సినీ నటుడు శ్రీ కె.వి.చలంగారు గానకళ సంస్కృతినీ పవిత్రతనీ ఉగ్గడించిరి.

శ్రీ శర్మగారు సన్మానమునకు సమాధానము చెప్పుచు ఈ సత్కారము సరస్వతీదేవిదేకాని తనది కాదనిరి. సంప్రదాయముల కతీతముగా కొన్ని కల్పనలను తాము చేయక పోలేదనిరి. తామునేర్చిన విద్యను ఇతరులకు (విద్యార్థులకు) అందిచ్చుచూ ఇంకా ఎక్కువసాధనచేసి సంగీతకళకు న్యాయము చేకూర్పయత్నింతు మనిరి.

అనౌచిత్య బాహుళ్య రహితంగా ఈ కార్యక్రమము నంతను దిగ్విజయముగా నడపిన శ్రీ పాపయ్యశాస్త్రిగారు అభినందనీయములు. విజ్ఞులు కనకాభిషేక విధానమునకు నిర్దుష్టమయిన నిర్దిష్టమైన రూపకల్పనచేయుట మంచి దనిపించును.

## శ్రీ వాల్మీకి రామాయణ కృతి కన్యారత్న ప్రదాన కల్యాణ మహోత్సవములు.

శతాధిక గ్రంథకర్త, ఆర్షకవి శిరోమణి, శ్రీ అన్నవరం సత్యవతీదేవి స్త్రీల ప్రభుత్వకళాశా లాంగ్ల శాఖాధిపతి, విద్వాన్ శ్రీ బులుసు వేంకటేశ్వరాంధ్రీ కృత శ్రీ వాల్మీకి రామాయణ కృతి కన్యారత్న శ్రీ వేంకటేశ్వర వరరత్న ప్రదాన కళ్యాణమహోత్సవములు ఫిబ్రవరి నాలుగైదు తేదీలలో శ్రీ. కె. ఆర్. వి. కృష్ణారావు లైబ్రరీ పౌనుహాలులో మహావైభవముతో జరిగినవి.

4-2-79 ఆదివారం సాయంకాలం 4-00 లకు శ్రీ స్వామివారి ఊరేగింపు మేళతాళములలో వేదపండితుల స్వస్తి వాచకములతో రామారావుపేట శ్రీ బులుసు వేంకటేశ్వరుల వసతి గృహము నుండి ప్రారంభమై పురవీథులనుండి సభాభవనము చేరినది; నాగస్వర యుగళము నిర్వహించిన శ్రీమాలానాసాహేబు బృందము అద్వితీయభక్తిప్రపత్తులతో శ్రీ స్వామివారి ప్రీతికై కావించిన రాగాలాపన, పాడిన భక్తికీర్తనలు ప్రజాహ్లాదయముల నెంతగనో ఆకర్షించి స్వామి







నక్తిని వెల్లివిరియఁ జేసినవి. శ్రీ చేబోలు రామావధాని శ్రీ కొలిచిన సుబ్బావధాని ప్రభృతుల ముహోత్సాహభరిత వేదవచనములు బ్రహ్మనాదమును స్మరింప జేసినవి.

5 గంటలనుండి 6-30 వఱకు శాస్త్రోక్తముగా శ్రీ బులుసు వేంకటేశ్వర దంపతులు శ్రీ వాల్మీకి రామాయణ కృతికన్యా శ్రీ వేంకటేశ్వర ప్రదాన కళ్యాణ మహోత్సవమును చక్కగా నిర్వహించిరి. ఇసుక వేసిన రాలకుండునట్లు విచ్చేసిన సభ్యప్రేక్షక జన మహాసముద్రము పొంగి పొరలుచుండెను. శ్రీ స్వామివారియు శ్రీ కృతికన్య యొక్కయు ప్రవరలు చెప్పునప్పుడు, మహాసంకల్పములు చెప్పునప్పుడు, కృతికన్యా ప్రదానము జరుగునపుడు తలంబ్రాల సమయమందు ప్రజల ఉత్సాహకోలాహలము వర్ణనాతీతము. సప్తగిరులనుండి శ్రీస్వామి దిగివచ్చి సభాసీనులైనట్లు స్పష్టముగా అందరును భావించి భక్తితన్మయులైరి.

ప్రత్యేకముగా విరచింపబడిన పద్యరత్నములతో పౌరులకు స్వాగతము పలుకుచు శ్రీ కందుకూరి రామచంద్రమూర్తి వేదిక నలంకరింపవలసినదిగా చదివిన పద్యములు, ఒక్కొక్కరికే చేసిన వర్ణనాత్మకాహ్వానము అతిమనోజ్ఞముగా అందరి ఆనందమునకు కారణమైనవి.

ఆనా డధ్యక్షస్థాన మలంకరించి గ్రంథము నావిష్కరించినది శ్రీ వేంకటేశ్వర తిరుమలతిరుపతి దేవస్థానమున ఎగ్జిక్యూటివు ఆఫీసరు శ్రీ పత్రి వేంకట రామకృష్ణ ప్రసాదు ఐ. ఏ. యస్. భక్తిభరితవినమ్రత, ఔచిత్యపరిజ్ఞానము, రసభరిత వాగ్ధోరణి శ్రీ ప్రసాదు సొమ్ముగా అందరు భావించిరి. శ్రీ వేంకటేశ్వర స్వామి పక్షమున శ్రీ ప్రసాదు శ్రీ వేంకటేశ్వరులు గారికి ఐదువేలరూపాయల చెక్కు సమర్పించిరి. దేవస్థాన చరిత్రలో ఇంతవఱకు ఇట్టి అంకితమహోత్సవమెన్నడు జరుగలేదని శ్రీ వేంకటేశ్వరులుగారు నిత్యము ఆ వేంకటేశ్వర సాన్నిహిత్యమున నుండి ఆయనతో మాటాడువ్యక్తి అని తనకంటె శ్రీస్వామికి ఆయనయే సన్నిహితులని తమ కవితాకళను భగవదంకితముచేసి శతాధిక గ్రంథముల దైవపూజ గావించిన మహనీయులు శ్రీ వేంకటేశ్వరు లని, వారి రచన దైవాదేశ సంపన్నమగుట గంగానదివలె జాలువారి అందరికి పవిత్రమైన దని పలికిరి. పౌరులపక్షమున, తమ పక్షమున శ్రీ కాశీభట్ల వరాహనరసింహశర్మ బి. కాం. (కమ్మర్షియల్ టాక్సు ఆఫీసరు, కాకినాడ) సమ్మానపత్రమును మహానందానుభూతి అను పేర చదివి సమర్పించి సత్కరించిరి. శ్రీ బులుసు వేంకటేశ్వర కవిని సమ్మానించి సత్కరించిన, మహనీయులు-

శ్రీ ఒక సాహిత్యాభిమాని రు 1116 శ్రీ గండికోట (రమ) సూర్యప్రకాశరావు శ్రీ రాఘవులు 1116 శ్రీ సి. యస్. లక్ష్మణాచార్యులుగారు 1116 శ్రీ జే. సత్యనారాయణగారు 500 శ్రీ పి. సుబ్బారావుగారు 116 శ్రీ శివలెంకరాధాకృష్ణ 116 (ఆంధ్రపత్రిక), శ్రీమతి యస్. ఉషారాణి 116 శ్రీ చుండూరు పురుషోత్తము బ్రహ్మం, అన్నపూర్ణ గార్లు 116 శ్రీ బొజ్జా ధర్మరాజుగారు 116 శ్రీ పి. శ్రీరామంగారు నూతనవస్త్రద్వయం టౌనుహాలు పక్షమున 116 శ్రీ యమ్. వీరభద్రరావు (కె. ఆర్ వి. కె లైబ్రరీ పక్షాన, 116 మహిళాసమాజం 116 శ్రీ రాజాచాముండీశ్వరి 160 శ్రీ జె.వి.సుబ్బారావు 200 శ్రీ హవాలెస్ కంపెనీ 200 తదితరులందఱు కలిసి 200 శ్రీ కె. రామకృష్ణచెట్టి (ఒ పి, యస్.) 101 కవిగారికి సమర్పించిరి.

శతాధిక వత్సరముల వృద్ధు శ్రీమాన్ రామానుజ మిశ్ర శ్రీ వేంకటేశ్వరులు గారిని మహాశీర్వచనమున సత్కరించిరి. ఆ శుభసమయముననే శ్రీప్రసాద్ ప్రసిద్ధ పౌరాణికు లగు శ్రీ ఆచార్యుల వారికి నెలకు రు 100 చొప్పున పెన్షను ఇచ్చు దేవస్థాననిర్ణయమును ప్రకటించిరి.

శ్రీమతి పి. ఉషారాణి అత్యంత మనోజ్ఞ కంఠముతో శ్రీ బులుసు వేంకటేశ్వరులు రచించిన అంకిత పద్యములను పఠించిరి.

శ్రీమతి యస్. రమాదేవిగారు మనోజ్ఞ ప్రశాంత భక్తిభరిత మృదుమధురోపన్యాసము చేయుచు శ్రీ వాల్మీకి రామాయణావశ్యకత, శ్రీ వేంకటేశ్వరాంధ్రీకృతిలోని విశేషములు, కవితాకమనీయత శ్లాఘించిరి. ఆ బాలగోపాలము ఆమె మాటలపొందికను, భక్తిని ప్రశంసించిరి.

శ్రీ బులుసు వేంకటేశ్వరులు తనకు జరిగిన ఘనసమ్మానమునకు కృతజ్ఞత తెలుపుచు దైవమేవిధముగా తన కవితకు ప్రేరకమైనదీ వివరించి, శ్రీ వాల్మీకి రామాయణ కృతికన్యా శ్రీ వేంకటేశ్వర ప్రదాన శుభసమయ మహాప్రసాద మను పేర తాను రచించి ముద్రించి పంచిపెట్టిన ౧౬ పద్యములను చదివి వ్యాఖ్యానించి సభ్యుల నానంద తన్మయులను గావించిరి.

శ్రీ పి. వి. ఆర్. కె. ప్రసాదు తమ చివరిమాటలలో ఇట్లు పలికిరి. శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానము సద్గ్రంథములను తామే ప్రకటించి అందరికందుబాటులో నుండు ధరకు విక్రయించుట, మహాకవులకు మహాకృతులకు ధనసహాయము చేయుట, దేవాలయ పునర్నిర్మాణము, దేవాలయములలో వేద పారాయణ చేయించుచు ఆ పండితులకు నెలజీతము లిప్పించుట, వేదములను పఠించు విద్యార్థులకు ఉపకార వేతనములు, వేదముల బోధించు వారికి నెలజీతము లిచ్చి పోషిం

చుట, ఉపన్యాసముల ద్వారా, కరపత్రములద్వారా, భక్తిభరిత స్తోత్రముల ద్వారా హిందూమత ప్రచారము విరివిగా గావించుట మున్నగు సత్కార్యములు తలపెట్టిన దని దానికి స్వామి కటాక్షము, శ్రీ వేంకటేశ్వరులుగారి వంటి మహనీయుల అండదండలు మిక్కిలి అవసరమని నొక్కి వక్కాణించిరి. శ్రీ ప్రసాదు చక్కని వక్త. చక్కని బుద్ధిశాలి. మంచి భక్తుడు. మంచి సరసుడు. ఈయన తిరుమల తిరుపతి దేవస్థాన కార్యనిర్వహణాధికారిగా వచ్చుట ముదావహ మని, ఈయన కాలమున ఎన్నో మంచిపనులు జరుగగలవని, సభ్యులందరు తలచిరి. శ్రీ కందుకూరి చినరామచంద్రమూర్తి వందన సమర్పణతో నాటి కార్యక్రమము ముగిసెను.

5-2-79వ తేదీ సోమవారం సాయంకాలము 6 గంటలకు శ్రీ కె. ఆర్. ఐ. కృష్ణారావు లైబ్రరీ (టౌన్ హాలు) లో అనివార్య కారణములవలన నాటి అధ్యక్షుడు శ్రీ కె. రామకృష్ణ చెట్టి ఐ.పి.యస్. రాజాలమి మునిసిపలు కమీషనరు భక్తశిఖామణి శ్రీ పి. బాలకృష్ణారావు శ్రీ వాల్మీకి రామాయణ నిత్యప్రచారావశ్యకత, శ్రీ వేంకటేశ్వరులుగారి శతాధిక గ్రంథ విషయ రచనావిధానము, సులభత, సుస్పష్టత మున్నగువానిని గూర్చి ముచ్చటించిరి.

శ్రీ వెంపరాల సూర్యనారాయణ శాస్త్రిగారు శ్రీ బులుసువారి వంశమర్యాదలు, ఆస్తికత, వారికవితా ప్రాశస్త్యము ప్రశంసించి ఐదుపద్యరత్నములలో శ్రీ వేంకటేశ్వరులుగారు 116 గ్రంథకర్తయే గాక 1116 గ్రంథములకర్త కావలెనని ఆశీర్వదించారు.

కాకినాడ స్త్రీల ప్రభుత్వకళాశాల అధ్యక్షురాలు శ్రీమతి ఆర్. కస్తూరీబాయి మాట్లాడుచు "శ్రీ బులుసు వేంకటేశ్వరులు మహాకవులు. వారివలన మాకు, మా కళాశాలకు మా విద్యార్థినులకు కలిగిన గౌరవ మనంతము. వారు మా కళాశాల మహాభాగ్యము" అని చక్కగా నుపన్యసించి సభ్యుల నానందపరచిరి.

శ్రీమతి డా పి. చిరంజీవినీకుమారి సంప్రదాయములను గుడ్డిగ నమ్ముటకాక చక్కగ పరిశీలించి నమ్మవలెనని శ్రీ వేంకటేశ్వరులు తమ గురువులని మహనీయులని వక్కాణించిరి.

శ్రీ అన్నవరం సత్యవతీదేవి స్త్రీల కళాశాలా విద్యార్థినీ సంఘాధ్యక్షురాలు కుమారి ముళ్ళపూడి యెల్లారమ్మ మాట్లాడుచు శ్రీ బులుసు వేంకటేశ్వరులు మహాకవులు, మహోపాధ్యాయులు, మహాపురుషులనీ వారి శిష్యురాండ్ర మని చెప్పుకొనుట తమకు గౌరవహేతు వని, గర్వకారణమని, వారి కవిత, వారి బోధన వారి హృదయము వెన్నముద్ద లని చక్కగ నుపన్యసించెను.

శ్రీ బులుసు వేంకటేశ్వరులు తమకు తమ వాల్మీకి రామాయణ కృతికన్యకు నింత గౌరవము లభించుట దైవకటాక్షము నసే అని, ఈ సన్మాన సభలకు వ్యక్తులు కాక దైవమే పూనుకొనుటచే ఇంత చక్కగ జరిగిన దని చెప్పి శ్రీ వాల్మీకి రామాయణము సులభసుందర ఛ్ఛందస్సులో (గీతములలో - వృత్తములలో) యథామూల మనువదింపుమని శ్రీ వాల్మీకి మహాముని శ్రీరాముడు ప్రేరేపించిన సంగతి తెలిపి శ్రీ వాల్మీకి రామాయణ ప్రథమశ్లోక ప్రథమపాద ప్రథమాక్షరములైన 'తపస్స్వాధ్యాయ నిరతం' అను మాటలనుగూర్చి పెక్కు విధముల వ్యాఖ్యానించి ఇవి ఆర్ష వాక్కులని బీజాక్షరయుతములనీ అనిరి. భగవత్కటాక్ష పాత్రులకే కాని కేవల పండితులకు పండితమ్మన్యులకు సత్యము చాల దూరమని సోదాహరణముగా తెలిపిరి.

శ్రీ కందుకూరి చినరామ చంద్రమూర్తి గారు వందన సమర్పణము చేసిరి. ఈ రెండు రోజుల కార్యక్రమము ఇంత దిగ్విజయముగా జరుపుటకు పూనుకున్న కమ్మర్షియల్ టాక్సు ఆఫీసరు శ్రీ కె.వి.యన్. శర్మ గారి నెల్లరు ప్రశంసించిరి. మంగళశ్లోకములతో కార్యక్రమము ముగిసెను.

# సాహిత్యంలో హేమంతం

— శ్రీ కరెవరపు వేంకట్రామయ్య, ఎం. ఏ.

( గతసంచిక తరువాయి )

ఋతుషట్కమును వర్ణించిన ఆధునిక కవులలో అద్దేపల్లి లక్ష్మణస్వామిగారొకరు. ఆయన 'ఋతువిలాసము' లో హేమంతమును శబ్దాలంకారప్రచురముగ వర్ణించిరి.

'బుసిపోయెనో పంచభూతాత్మకంబైన
ప్రకృతియంతయునొక్క రాత్రిలోనె
ప్రసరించెనో నిశోగ్రధ్వాంతవల్లరి
పుంజంబు దానొక్క పూటలోనె
నిశినిల్చెనో సాగి కసిలించుచు, నిజేశు
బాసి బాపురె! తెల్లవారులోనె
ఉసియయ్యెనో ధాత్రినుదయాద్రి సర్వంబు
అరుణార్కబింబోదయంబులోనె
కన్నులుండిన లాభంబు గాంచనీని
యట్టు, కనుకట్టు, కట్టెనో అరరె! కాల
మాంత్రికుండన నొప్పారు మహిని సకల
కవభృదంతర దంతురాక్రాంతహిమము'

అద్దేపల్లివారు హేమంత శిశిరములనుకలిపి ఒకే ఋతువుగ వర్ణించుట విశేషము. కావ్యాంతమున షడృతువులను ఒకపద్యములో వర్ణించిరి. 'అవిరాట్పురుషుండు గావించు హావములో, స్రుక్స్రువంబులు మంచు సానకార్లు' అని హేమంతమునందు చేర్కొనిరి.

సామవేదం జానకీ రామ శర్మ 'ఋతుహేల' షడృతువులను వర్ణించిన మరొక ఆధునిక కావ్యం. తమకావ్యంలో శర్మగారు ప్రకృతిని మానవ సమాజం నుంచి వేరుచేసి ఏకాంతంగా చూడలేదు. మానవసమాజంతో సన్నిహితమైన ప్రకృతికి వారు తమ కావ్యంలో రూప కల్పన చేశారు.... మానవుల నిత్యజీవితంలో కనిపించే మార్పులను, ఋతువులకు వుండే సంబంధాలను, ఏయే ఋతువులలో పొలాలలోని పంటలు ఏవిధంగా వుంటాయో మొదలైన విషయాలను శర్మగారు తమ 'ఋతుహేల'లో ప్రాధాన్యం ఇచ్చారు'- అని శ్రీసంజీవదేవ్ గారి అభిప్రాయం. 'రమ్య హేమంతమే ఋతురాజ మనగ తరలి వచ్చిన' దట హేమంతము. తెలుగు పల్లెలను ఎంతసహజముగ వర్ణించిరో చూడుడు.

'చేలగట్టున పచ్చపూల సింగారాల
నొలికించె జనప మొక్కలు తమంత
కాలిబందము పచ్చికానికి దట్టమై
కొనలుసాగెను గట్టు మినపతీగ
పురుగుపట్టిన దొండ పెరటిలోనచిగిర్చి
పూలపిందెల క్రొత్త పొలుపుదాల్చె
చచ్చిన కాకర చచ్చినట్లే యుండి
తుది మొదళ్ళగ నావతొడగిపోయెను
'కడచిపోయినదే మేలికాలమన్న'
నానుడికి కూర్చి మృష యాధునాతనముగ
చేల పెరడుల హేమంత సిరులు చాల
కూర్చుకొనె తెల్గు పల్లెలు కొసరికొసరి'

కర్షక ప్రకృతితో కవికిగల అనుబంధమునకు నిదర్శన మీ పద్యము. కాగా చలికాలమందు సామాన్య ప్రజల అందునా భిక్షుకుల పేదల, దరిద్రుల జీవితమును ఎద లోతులను కదలించునటులు సముదాత్త భావసరణితో కరుణరస పరిప్లావితముగ చేసిన వర్ణన గమనింపదగినది.

'కడుపులోనికి కాళ్లు ముడుచుకు ముద్దయై
వీథిపంచ పరుండు బిచ్చగాడు
చిరిగిన గొంగళి చిన్నపిల్లను కప్పి
పేరుచు చలిదూగు పేదతల్లి
ఆకటి దయ్యమ్ము సోకగా నదనద
రైయుండి గజగజలాడు బుడుత
చలికప్పు సుతునకు సంతరింపగ లేక
యలియు గుండియజూచునట్టితండ్రి
యగుచు హేమంతమకట దయాదరిద్ర
మయ్యె నెల్లెడ బీదల యార్తరవమె
తోచుచునన్న విధమ్ముగ నాచియాచి
సన్న రొదతోడ సీతువు సంచరించె.

ఇంకను హేమంతమునందే సంక్రాంతి సంబరములు చక్కగా వర్ణితములు.

గంటూరి శేషేంద్రశర్మగారి 'ఋతుఘోష' షడృతువర్ణన విలసితమగు మరో ఆధునిక ఋతుకావ్యము. ఇది లఘుకృతి. ఇందు కవి హేమంతవర్ణనలో సూర్యస్తవ మొనరించుట గమనింపదగిన వైచిత్రి. హేమంతమును వర్ణించిన ఆఱుపద్యములు సూర్యస్తవములే.

'తిమిరములోన బాధపడు
దీనజనాళికి దారిజూపినీ
యమల మయూఖమాల చరి
తార్థము చేయక లాలిలీలతా
సుమసముదాయ మూర్తివయి
శూన్యపథమ్ముల సంచరించు మన్
హిమరమణీయ సౌధముల
నెచ్చటనో వసియింతువా ప్రభూ!'

పద్యరచనలో శ్రీనాథుని ఒడుపు శ్రీ శర్మగారికి బాగాపట్టువడినది. శిరీష

సుకుమ పేశలమైన శైలి వీరిది. అపూర్వ విచిత్రాలు వీరి రచనలో దర్శన మిస్తాయి.

శ్రీ పైడిపాటి సుబ్బరామశాస్త్రిగారి ఋతుప్రబంధము' షడృతువులను వర్ణించిన మహోక మేలికృతి. వీరికృతిలో విశ్వనాథ వారి కవితాచ్ఛాయలు కన్పట్టుట విశేషము. అయితే దర్శనములో ఏరి ప్రత్యేకత వీరిదే. హేమంతమును ఎట్లు వర్ణించిరో చూడుడు.

మహితోజ్జ్వలమ్మైన మణిగోపురమువోలె
ధగధగలాడి శాద్వలపు కొసల
తండ్రిమస్తముపైఁ దనయుఁడట్టులనిల్చి
గరుడవర్ధన పూవుశిరసుపైన
ఆచార రహితుని యైశ్వర్యమట్టులు
తమ్మాకు కొన దాటి దుసికిలపడి
చిత్తనిరోధమ్ముఁ జేసిన యోగినా
నీలోత్పలమ్ములో నిలుకడవడి
సాగుకోరిక మొత్తెంపు సరులునగుచు
తెగిన యాశల నంతంతఁ ద్రెస్సిపోయి
వ్యాఖ్యలై నిల్చి జీవితపథములందు
మంచు బిందులు ప్రబల హేమంత వేళ.

కాగా డా॥ సి. నారాయణరెడ్డిగారి "చక్రం' మాత్రాచ్ఛందస్సులలో ఋతుషట్కమును వర్ణించిన మొట్ట మొదటి గేయకావ్యం. శైలీ ప్రసన్నత లక్షణం. రెడ్డిగారి ప్రకృతిపరిశీలనా మునకు, భావనా మాధుర్యమునకు, దీనికి నిదర్శన మీ కావ్యము. అంతమండలి సూర్యచంద్రులను పోలిన రాజకీయ పరిస్థితుల కన్వయిం సన్నివేశము మనోహరము.

కనా ముజ్వలముగ భువి
గించిన రవి చంద్రులు
పదిచ్యుతులైన మంత్రి
స్య లట్టులైరి నేడు.

ఇందలి వ్యంగ్యము సహృదయరంజ నము. రవిచంద్రులు తమ ప్రతాపమును, ప్రకాశమును 'మాజీమంత్రుల' వలె పోగొట్టుకొనిరట. ఇక హేమంతప్రకృతి చూడుడు.

'జనపద రంగమ్ముల
సస్యరమణి ఆకుపచ్చ
చేలమ్ముల బదులు పసుపు
చీరలు ధరియింపసాగె'
'పెరడులోన తీగనిండ
విరిసిన గుమ్మడిపూవులు
కన్పించెను క్షేత్రలక్ష్మి
కై బంగరు గిన్నెలవలె'

ఇట్లే నారాయణ రెడ్డిగారు చైనా, పాకిస్తాను భారతదేశముపై సాగించిన దురాక్రమణను దృష్టిలో నుంచుకొని 'భవిష్యత్ హేమంతము' అను ఒక చక్కని గేయము రచించిరి. (మా. భారతి-నవంబరు. 1965.)

శిశువువలె చిఱునవ్వులు
ప్రసరించెడు పైరులపై
పొంచి, పొంచి పిడుగులు కురి
పించిన విషధరపంక్తులు
నీమనస్సు పింఛం విప్పేదెలా
నీలో హరివిల్లువిరిసే దెలా
మిన్ను విరిగి మీదపడిన
కన్నుతలంపు వేయకుండ
అర్ధరాత్రిమున హిమశైలాగ్రమున నిల్వగలను
ధమనుల పారెడురక్తం
హిమవర్షా పాతమున గడ్డకట్టిన
జనరక్షా దీక్షను విడువను
చలికాలంలోనో, పువ్వులకాలం
అవతరించు గుండెలోని
సంకల్పం గాండీవమై మ్రోయును'

ఇక ఆధునికులలో కాళిదాసు 'ఋతు సంహారము' నాంధ్రీకరించిన వారు పలువురు కలరు. వీరిలో శ్రీ దిగుమర్తి సీతారామస్వామి, శనగన నరసింహస్వామి, పాటీలు తిమ్మారెడ్డి పేర్కొనదగినవారు. సీతారామస్వామి గారి శైలీ లాలిత్యము, గాంభీర్యము పరిశీలించినచో శ్రీనాథుఁడే దిగివచ్చి వెలసెనా అనునట్లుండును.

'చేలకుం గ్రొత్తచివురులు చెలువుగూర్ప
పండువారిన వరికంకె పసిడిసంచ
లొద్దుగలుపూచి తమ్మిపూల్ సద్దికొనఁగ
మంచుకురియగ వచ్చె హేమంతఋతువు'

అట్టి హేమంతమున నొక సుందరీమణి మేల్కొని సురతానందము నొందినదట. ఆయనవర్ణన చూడుడు.

'అరవిందా ప్త కరాభిత ప్తయయి ని
ద్రానందముం బొందునో
క్కరమా సుందరి స్వైరపుష్పశరభో
గక్రాంతయై రాత్రి జా
గరరాగారుణ నేత్ర పద్మయయును, ము
క్తస్రస్తదీప్తాంసదే
శరిరం సూజ్జ్వల నీలకేశయయున
లాస్యభ్రూభ్రాంతాకాంతయై'

కాగా హేమంతమును సందర్భవశాన వర్ణించిన ఆధునిక కవులు పెక్కురు కలరు. వారిలో తుమ్మల సీతారామమూర్తి గారు చేసిన హేమంత వర్ణన శిరశ్శేఖరము. అచ్చమైన తెలుఁగు దనముతో తీయతేనియ తెలుగు పదములతో సాగినది వీరివర్ణన.

'కొసరినూలీనపచ్చిపసుపుబూత మొగాన
గుమ్మడి పూదుమారమ్ము నద్ది
కండరేగడ నారబండి కన్పండువై
పొలుచు మిరఁపబండు బొట్టుకొని

పలిపెమ్మనవ నొక్క వాసి హెచ్చయినట్టి
నునుమంచు తెరచీర నాలుకొల్పి
బంతిపూవులకు జేమంతి నెయ్యముగూర్చి
కబరీభరమ్ము చక్కన వదిర్చి
పంటకళ్లాలు మును బరాబరులు సేయ
గూడుకట్టిన తెలిమబ్బుగొడుగు నీడ
కదలివచ్చెను భాగ్యాలకడలి బోలె
మకరసంక్రాంతి లక్ష్మి హేమంత వీథి'.

అంతేకాదు. మధుర మధురానురాగ సామ్రాజ్య పీఠియందు మకరధ్వజము నెత్తి జగత్తులో కొలువున్నదట. ఇల్లే ఏటుకూరి నరసయ్యగారు 'సంక్రమణం' అను శీర్షికతో పౌష్యలక్ష్మిని మధుర మనోహరంగా వర్ణించిరి.

'పచ్చిక బంగారు పావడా దిగజారి
నీరెండ మైచాయతీరు గేర,
మబ్బుపాయల వరుల్ మలసినీలాలాడ
పరిగ పిట్టల పలుకు లారవునూప,
మంచుముత్యాల దామంబులు తూగాడ
చలిగాలి యూర్పులు సందడింప,
విరిమల్లె నవ్వులు గరగరల్ పచరింప
బంతిదుద్దుల కాంతి గంతులిడగ
పగులబడి యొక్క పెట్టున పౌష్యలక్ష్మి
సంజకెంజాయ నలరింప చక్కవచ్చె,
చిట్టి సంక్రాంతి మోమింత చేసికొనియె
బంతి చేమంతి మిరపల పౌరుషమున'

ఇప్పటివరకు పరిశీలించినది దాదాపు సాంప్రదాయిక రీతిలోనడచిన హేమంత వర్ణన. దీనికి వ్యతిరేకముగ భావకవితా యుగమునందును, అభ్యుదయ కవితోద్యమమునందును సాగిన హేమంతవర్ణన నించుక అరయుదము. భావకవితోద్యమరథసారథిగా కృష్ణశాస్త్రి హేమంతమును విషాదమునకు ప్రతీకగా కష్టభూయిష్ఠమైనదిగా పేర్కొనిరి.

'నాకు ఉగాదులు లేవు
నాకు ఉషస్సులు లేవు
నేను హేమంత కృష్ణానంత శర్వరిని'

అంటారు. అంతేకాదు.

'చివురింపదో చైత్రశుభో
త్సవ విభాత కల్యాణము
ఈ దరిద్ర హేమంతమున'

అని విషాదనేత్రముతోనే హేమంతమును వీక్షించినారు. ఇక అభ్యుదయ కవితా భగీరథుడు శ్రీశ్రీ 'మహాప్రస్థానం'లో-

'వాసంత సమీరం నీవై
హేమంత తుషారం నేనై
నీ ఎరిగిన జీవనవిహంగం
నాపగిలిన మరణమృదంగం'

అని 'అద్వైతం' ఖండికలో రేఖాప్రాయంగా హేమంతమును వర్ణించిరి. కాని ఆధునికులలో పైవారికి భిన్నంగా దాశరథి హేమంత శ్రీని మధురంగా వర్ణించినారు.

'మంచుకొండలు నేటివా ? హే
మంత ఋతువీ నాటిదా ?'

అని ఆశ్చర్యపోతూనే హేమంత ప్రాచీనతను గుర్తుకు తెస్తాడు.

'చలివీణలు నరాలలో చొరబడి
చక్కనిపాట ఒకటి వాయించనీ,

అంటాడు. ఇంకను చలిని ప్రాచీనులు ఆధునికులు భయంకరమైన దాన్నిగా వర్ణిస్తే ఈయన ప్రీతితో దాన్ని సంస్తుతించుతాడు.

'హేమంతం వజవజవణకులు
భూ భామకు చక్కని చెణుకులు
హిమాచలం పెంచిన యంచులు
మనసౌఖ్య స్వర్గపుటంచులు'

ఇంకను రాయప్రోలు, నాయని కొడాలి, తిలక్, బాపురెడ్డి ఇత్యాది కవులు హేమంతమును వర్ణించిరి.

ఏవంవిధముగ ప్రాచీనాధునికు లెందరో ఈ ఋతువును సర్వసమగ్రంగా వర్ణించినారు. వర్ణ్య మొక్కటే యైనను కవులు వైయక్తిక భావనాబలముతో రసరమ్యముగ వర్ణించిరి. ఈ వర్ణనలో ఎవరి ఒడుపు వారిదే, ఎవరి అబ్బులు వారివే. అందుకే ఎవడేమి చెప్పాడని పరిశీలించే కన్నా, ఎలా చెప్పాడని పరిశీలించవలెను. లేనిచో కవితాప్రగతికి అవకాశమేలేదు అందుకే పరమభావుక పట్టభద్రుడొకడు కవితామర్మమును ఇట్లు విప్పి చెప్పినాడు.

'యానేవ శబ్దాన్ వయ మాలపామః
యానేవచార్థాన్ వయ ముల్లిఖామః
తైరేవ విన్యాస విశేష భవ్యైః
సమ్మోహయంతే కవయో జగంతి॥

శబ్దములు అందరూ వాడుచున్నవే అర్థములు తెలిసినవే. మరి కవి ధర్మ మేమంటే 'కూర్పు నేర్పు'. దానివల్లనే ఈ జగత్తు సమ్మోహపడుచున్నది కవులంటే. కావుననే ఇందరు కవులు అనుభవప్రసన్నమైన ఋతుగాన మొనర్చినారు.

మొత్తముమీద ఆంధ్ర సాహిత్య మందలి హేమంతఋతువర్ణన పరిశీలించినచో మనకు మూడు రీతులు స్పష్టముగ కన్పట్టును.ఆదికవి వాల్మీకివోలె ప్రకృతిని నేపథ్యముగ చేసికొని లేక పాత్రలతో తాదాత్మ్యము చూపుచు వస్త్వాశ్రయ రీతిని సూక్ష్మముగ కథాగమనమునకు అడ్డురానిరీతిలో వర్ణించిన కవులు మొదటి కోవలోనివారు. నన్నెచోడ, ఎఱ్ఱనాదులు. శ్రీనాథ, ప్రబంధకవులు రెండవ కోవలో చేరుదురు. వీరు కేవలవర్ణనదృష్టితోనే వర్ణనలు సాగించిరి. కొ[illegible] ఈ వర్ణనలు కథాగమనమును [illegible] కూడ. ఈ వర్ణనలు కేవల క[illegible] ప్రదర్శకములే. ఉత్ప్రేక్షలత[illegible] శయోక్తులతోను కలరూపు వ[illegible] నది. కాగా ఆధునికులు వ[illegible] లోనికి చెందుదురు. వీరు ఆత్మా[illegible] హేమంతమును వర్ణించినారు.

బహుగుణరమణీయము, స[illegible] జము, చారుభాస్వంతము నగు ప[illegible] తము ప్రీతిని కలుగజేయు గాత.

'మాసానాం మార్గశీర్షోహమ్' [illegible]

—0—

## —* రచయితలకు మనవి *—

సంక్షేపముగను, సౌమనస్యముతోఁ గూడినవిగాను, నుండు విమర్శనాత్మక రచనలకు స్వాగతము. గ్రంథవిమర్శకుఁ బ్రాముఖ్యము. ఔచిత్యము మీఱని అభిప్రాయ భేదములకు సముచిత గౌరవము. వాఙ్మయమునఁ జేరఁదగు వివిధాంశములపైఁ దమ రచనలు పంపి మాకుఁ జేయూఁతనీయఁ బ్రార్థన. రచనలు సరళగ్రాంథికములోఁ గాని, శిష్టవ్యావహారికములోఁ గాని యుండవచ్చును. సలక్షణములు రసవంతములు నగు పద్యరచనలకు ప్రత్యేక స్వాగతము.

సమాలోచనముపట్ల ఆదరాభిమానములతో రచయితలు సంపూర్ణ సహకార మొసగుచున్నందుకు సంతోషము. రచన లతి దీర్ఘములై 'సశేషములు' కాకుండునట్లు ప్రయత్నించుట మిక్కిలి అవసరము.

వివిధ ప్రక్రియలకు సంబంధించిన సంగ్రహ రచనల నాహ్వానించుచున్నాము. సమాలోచన గ్రంథవిమర్శకు (సమీక్షకు) ప్రత్యేక ప్రాముఖ్య మిచ్చును. సమీక్షకు పంపు గ్రంథములు రెండేసి ప్రతులు పంపవలయునని గమనింపఁ గోరిక.

- సంపాదకుడు.

అడ్రసు :—


సంపాదకుడు, విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి,
Retired Telugu Lecturer, V. T. J. College,
6-8-7, ఇన్నీసుపేట (త్యాగరాజ నగర్), రాజమండ్రి-1.


## చందాదారులకు

సమాలోచన మొదటి సంపుటము 1 to 24 సంచికలు 2 వాల్యూములుగా బైండు చేయబడి యున్నవి. రెండువాల్యూమ్సు వెల పోస్టేజీతోసహా రు 18-00 లు ఎం. ఒ. ద్వారా పంపువారికి రిజిష్టర్డు పోస్టులో పంపబడును. వాల్యూములు అతిస్వల్పసంఖ్యలో మాత్రమే ఉన్నవి.

— సంపాదకుడు 'సమాలోచన'

Editor, Printer and Publisher B. Sitharama Sastry, Printed at B. V. & Co., Press, Innispet, (Tyagaraja Nagar) Rajahmundry-1.